# అమృత వాహిని

— డా॥ ముదిగొండ శివప్రసాద్



'విజయ' అనుబంధ మాలికలో

వెలువడ్డ ముప్ఫయి రెండవ నవల

విజయ
30. ధనలక్ష్మి కాలనీ
మద్రాసు-26



అమరావతి నుండి కృష్ణానది దిగువగా ప్రవహిస్తూ విజయవాడ చేరుతుంది. ఈ మధ్య దూరం లాంచీ పైన సుమారు రెండు గంటలలోపు ప్రయాణం. నదికి ఇరువైపులా జామ తోటలూ, నారింజ-నిమ్మతోటలూ, మామిడి తోపులూ విస్తృతంగా వున్నాయి. నది మధ్యలో లంకలు-అందులో మిక్కిలి సారవంతమైన భూమి వుండటంతో, పుచ్చకాయలు, కర్బూజాలూ ఇతరములైన పంటలు సమృద్ధిగా పండుతాయి. ఈ ప్రకృతినీ, పంటలనూ ఆశ్రయించి కృష్ణానదికి ఇరువైపులా చాలా పల్లెలు వెలిశాయి. అందులోని ఒక చిన్న గ్రామం పేరు బోరుపాలెం!

దీనికి ఈ పేరు ఎలా వచ్చిందో భాషా శాస్త్రజ్ఞులు పరిశోధన చేయాల్సిందే! నిరంతరం ఇక్కడ గాలి 'హోరు' మని శబ్దం చేయడం వల్ల ఇది 'హోరుపాలె'మని పిలువబడుతూ, క్రమంగా అది 'భోరుపాలెం'గా మారి, చివరకు నేడు 'బోరుపాలెం' అనే పేర స్థిరపడి వుండవచ్చునని ఊహించవచ్చు! ఈ వూరికి బస్సు సౌకర్యాలు లేవు. కాస్త వాన పడితే, ఎడ్లబండ్లు కూడా బోరుపాలెం వదిలి ముందుకు సాగలేవు. ఇక్కడికి దినపత్రిక రాదు, రేడియోలు లేవు! ఆధునిక నాగరికతా స్పర్శనూ, గంధాన్ని ఈ గ్రామం ఇంకా అందుకోలేదు. అలాంటి వూళ్ళో జన్మించాడు మధుమూర్తి- మన కథానాయకుడు!

"ఎవరీ మధుమూర్తి? ఏమిటితని కథా కమామిషు?" ఈ విషయమంతా నేరుగా నేను పాఠకులకు పరిచయం చేయనక్కర లేకుండానే సుందరి మీకు పరిచయం చేస్తుంది.

అయితే 'ఈ సుందరి ఎవరు?' అని మాత్రం మీరు ఎవరినీ అడగవద్దు-రచయితను కూడా। అడిగి ప్రయోజనం లేదు.

ఇంతకూ అసలు జరిగిందేమిటంటే, మామూలుగానే మధుమూర్తి ఆ సాయంత్రమూ కృష్ణానదీతీరానికి వెళ్ళాడు. బోరుపాలెం గ్రామానికీ కృష్ణానదికీ మధ్య ఎత్తయిన కట్టఒకటి వుంది. దీనినే కరకట్ట అని స్థానికులు పిలుస్తారు. ఈ కరకట్ట వరదల నుండి గ్రామాన్ని కాపాడుతుందన్న మాట, అందుకోసం కట్టారు. కరకట్టను ఆనుకొని మామిడి తోపులూ-జామతోపులూ, వీటికి అవతల ఓ వంద గుడిసెలు, కొద్దిగా పెంకుటిళ్ళు,ఒకటీ అరా డాబా ఇళ్ళు, వీటికి అవతల ఓ దేవాలయం- ఇదే బోరుపాలెమంటే।

ఆ సాయంత్రం తోటలలో నుంచి నడుచుకుంటూ వెళ్ళి కరకట్ట ఎక్కాడు మధుమూర్తి. సూర్యకిరణాలకు నదిలోని 'చేడిస' చేపలు స్వర్ణ మత్స్యాలుగా మారిపోయాయి. ఆకాశం పండువారిన వాల్మీకి మహర్షిలా వుంది. ఎర్రదనం తగ్గిన కొద్దీ గాలికి ఊగే మహర్షి ముసలి గడ్డం వలె తెల్లదనం చిద్రుపలు చిద్రుపలుగా అన్ని దిక్కులకూ వ్యాపించింది.

మధుమూర్తి మరి కొంచెం ముందుకు సాగాడు.

ఊగుతున్న తాటిచెట్ల ఆకుల మీద గాలినే గంటంగా చేసుకొని ఆకాశం నిశ్శబ్ద సాహిత్యాన్ని లిఖిస్తున్నది.

ఆ గంటం గరగరలే కృష్ణానదీ ప్రవాహ ధ్వని....జల జల జల జల జల జల జల జల.

మధుమూర్తి మరికొంత ముందుకు పోయేసరికి చీకటి పడింది.

వెనుక ఏదో అడుగుల శబ్దం!

ఎవరో నడిచి తన వెనుకే వస్తున్నట్లు అనిపించింది. వెనుదిరిగి చూచాడు మధుమూర్తి!

నిజమే! తనను ఎవరో అనుసరిస్తున్నారు!

మధుమూర్తి నిలిచిపోయాడు! ఆశ్చర్యంగా చూడసాగాడు. చిరు చీకటిలో ఆ వ్యక్తిని పోల్చుకోవాలని ప్రయత్నించాడు.

ఆ వ్యక్తి 'అతడు' కాదు, 'ఆమె'!

ఆకాశంలో వెన్నెల వెలుగులు చీకటిని తరుముతున్నాయి.

ఆమె మరికొంచెం దగ్గరికి వచ్చింది.

మధుమూర్తి ఉలిక్కిపడ్డాడు!

ఈమె ఎవరో కొత్త మనిషి!

బోడపాలెంలో ఈమెను తానెప్పుడూ చూచినట్లు లేదు. రాయపూడి, హరిశ్చంద్రపురం-చుట్టు పక్కల ఏ గ్రామాలలో గాని చూచిన గుర్తు రావడం లేదు.

లంకలలో కూడా!

మధుమూర్తి ఆమెను పరిశీలనగా చూచాడు. ఆమె చాలా అందంగా వుంది.

జడలో ఓ కలువపువ్వు గుచ్చుకుంది. మెడలో శంఖులు పొదిగిన బంగారు హారం, కనకాంబరం రంగు పట్టుచీరె, చిలకపట్టువన్నె జాకెట్టు. చేతులకు రవ్వలు పొదిగిన గజులు, కాళ్ళకు అందెలు.

ఈమె పొలాల్లో పనిచేసుకునే పాటక స్త్రీ కాదు. గ్రామంలోని గృహస్థురాలు కూడా కాదు. ఎవరో అసాధారణ స్త్రీవలె వుంది.

'ఇంతకూ ఈమె మానవ కాంతయేనా?'

మధుమూర్తికి ఆ అనుమానం రాగానే ఆమె ఫెళ్ళున నవ్వింది.

ఆ నవ్వు తెల్లగా నదిమీద ప్రవహించింది ఓ పడవలాగా.

"ఇదేమిటీ? మీరు నవ్వితే నదిమీద తెల్లని తెరచాప ఎత్తిన పడవ కన్పడ్డట్లు అయిందినాకు" అన్నాడు మధుమూర్తి నివ్వెరపోయి.

"నిజమే- నీవు చూచింది" అన్నది ఆమె.

"మీరు—మీరు....?"

"నేను మధుమూర్తి! నన్నే పోల్చుకోలేదా!"

ఆమె మధుమూర్తిని మాటల్లోకి దింపి కరకట్ట దిగుతున్నది. మంత్రబద్ధ భుజంగంలాగా మధుమూర్తి ఆమెవెంట కరకట్ట దిగాడు.

"పోల్చుకోలేదు" అన్నాడు మధుమూర్తి ఆమెను అనుసరిస్తూ.

ఆమె మళ్ళీనవ్వింది-ఆ నవ్వు నదిపై వ్యాపించగానే ఈ సారి కృష్ణానదిపై మరోపడవ తెల్లగా కన్పడింది.

ఈ సారి పడవలో మనుషులు ఉన్నారు. వారు—

"గౌతమీపుత్ర శాతకర్ణి వర్ధిల్లాలి! ధాన్యకటక సామ్రాజ్యం వర్ధిల్లాలి!

తెలుగు వెలుగులు వ్యాపించాలి" అంటూ నావికులు జయ జయ ధ్వానాలు చేస్తున్నారు.

క్షణంలో పడవ మళ్ళీ మాయమైంది.

"ఇదేమిటీ? నేను చూస్తున్నది నిజమా- కలా?"

"నిజమే మధుమూర్తీ! నీవు ఇంతకుముందు చూచిన పడవలో గౌతమీ పుత్ర శాతకర్ణి వెన్నెల విహారం చేస్తున్నాడు. ఆ పడవ శాతవాహనులది."

"ఎప్పటి శాతవాహనులు? రెండువేల ఏళ్ళనాటివారు కదా?"

"ఔను-రెండు వేల ఏళ్ళనాటివారు. కాని నేను తలుచుకుంటే నీకు ఇరవై వేల ఏళ్ళనాటి దృశ్యాలు చూపించగలను."

"మీరెవరో మానవకాంతవలె లేరు!"

"మానవకాంతను కాదు - అట్లని దేవకన్యనూ కాదు."

"మరి—మీరెవరు? యక్షిణీకన్యా?"

"నేను సుందరిని."

"సుం....ద....రి...." ఈ మూడు అక్షరాలు విడి విడిగా ఉచ్ఛరించాడు మధుమూర్తి.

ఆమె మళ్ళీ నవ్వింది.

ఆ నవ్వు చూస్తూండగానే తెల్లని పడవ 'కిందికి మారిపోయింది! ఆ పడవ విజయవాడనుండి అమరావతివైపు ఎగువగా ప్రయాణం చేస్తున్నది.

"రుద్రదేవ మహారాజులవారూ వర్ధిల్లాలి— కాకతీయ సామ్రాజ్యం వర్ధిల్లాలి" అని పడవలోనుండి నినాదాలు విన్పడుతున్నాయి గట్టిగా.

"ఇదేమిటీ?" మధు వింతగా ఆమెను చూస్తూ ప్రశ్నించాడు.

"ఇప్పుడు నీవు చూచింది కాకతీయ రాజ్యాల యుద్ధ నౌక. గుంటూరు రాజులు కాకతీయుల శత్రువులతో చేతులు కలిపారు. అందుకని రుద్రదేవ మహారాజు అనే నామాంతరం గల రుద్రమదేవి తన సేనలను కృష్ణానదిలోకి దింపింది. నీవు చూచింది ఆ కాకతీయుల యుద్ధనౌక. అందులో కాకతీయుల సేనా నాయకులు గోనగన్నారెడ్డి త్రిపురాంతకుడూ-ఇద్దరూ వున్నారు. వారు అమరేశ్వరునికి అభిషే

కాలు చేసి, అటునుండి వెనుకచాటుగా గుంటూరును ముట్టడిస్తున్నారు. గన్నారెడ్డి వర్ధమానపురం నుంచి వస్తున్నాడు."

"నాకు మతిపోతున్నది. ఎక్కడి కాకతీయులు? ఎక్కడ గోన గన్నారెడ్డి? ఎనిమిది వందల ఏళ్ళనాటిమాట!"

"నేను చెప్పలేదా? నేను తలుచుకుంటే నీకు ఏమైనా చూపించ గలను!" ఆమె నదీ తీరానికి వెళ్ళి కూర్చొని, నదిలో కాళ్ళను విలాసంగా ఆడిస్తున్నది - మధుమూర్తి దిగ్భ్రాంతుడై ఆమె వెనుక నడిచి వెళ్ళి ఆమె పక్కనే కూర్చున్నాడు.

"నా పేరు మధుమూర్తి అని మీకెలా తెలుసు?"....ఆమె నవ్వబోయింది.

"నవ్వకండి - మళ్ళీ విష్ణుకుండినులదో- శాలంకాయనులదో ఇంకో పడవ కన్పడుతుంది-దయచేసి నా ప్రశ్నకు జవాబు చెప్పండి?"

"నీవంటే నాకు ఇష్టం మధుమూర్తీ! అందుకనే నీ గూర్చి నాకు అంతా తెలుసు. నీ పేరు మధుమూర్తీ, మీ నాయనగారి పేరు రామసుబ్బయ్యగారు. పూర్వాచారపరాయణుడు. మీ తల్లి పేరు మహాలక్ష్మమ్మగారు. అన్నట్లు నీకో చెల్లెలు వుండాలి కదూ-శ్యామల."

"ఔను మీరు చెప్పిందంతా నిజమే!"

సుందరి రెప్పలు టపటప లాడించింది. కృష్ణలో అలలు ఒక్కసారి పైకీ కిందకీ వేగంతో లేచాయి.

"ఔను- మీరు చెప్పిందంతా నిజమే!" మధుమూర్తి మళ్ళీ అని స్థాణువు వలె మారి వింటున్నాడు.

"మీకో పాలేరు వున్నాడు కదూ-వెంకన్న. వాడే మీ ఆవుపాలు పితుకుతుంటాడు. అదే తెల్లావు- దాని పేరు మంగళ కదూ?"

మధుమూర్తి రెండు చేతులూ జోడించాడు. "ఔను- ఔను- ఔను! మీరు చెప్పిన ప్రతి అక్షరమూ నిజమే! మీ కివన్నీ ఎలా తెలుసు?"

"ఇందాక చెప్పాను కదా- నాకు నీవంటే ఇష్టమని. నీ గూర్చి నాకు అంతా తెలుసు. నీ గురించి నీకు తెలియని విషయాలు కూడా నాకు తెలుసు. నీవు సంపాదనాపరుడివి కావని మీ నాయనగారు దిగులు పడుతున్నారు. నీకైతే ఉద్యోగాలు చేసి ఊళ్ళేలాలనే కోరిక

ఏ కి శానాలదు. మీ ఊళ్ళో వాళ్ళందరూ నిన్నో వెర్రివెంగళప్ప అని అనుకుంటున్నారు. నిజమేనా?"

"ఏమో! మా ఊళ్ళో వాళ్ళు నా గూర్చి చాటుగా ఏమను కుంటున్నారో నాకు తెలియదు."

"నాకు తెలుసు మధుమూర్తీ! ఈ గ్రామాల్లోని చలం, నరసింహం, కరుణాకరం, హేమలత-ఇంకా అవతలి వూళ్ళ వాళ్ళూ-అందరూ నాకు తెలుసు మధుమూర్తీ! హేమలతను చూచావా?"

"విన్నాను- చూడలేదు."

"చూడరాదూ?"

"ఎందుకు?"

"అందమైనది ఔనో కాదో పోల్చుకునేందుకు."

"ఊళ్ళో ఎవరో అమ్మాయి అందాన్ని నేనెందుకు చూడాలి?"

"మరి నన్నెందుకు చూస్తున్నావు?" సుందరి సూటిగా ప్రశ్నించింది.

"అదే తెలియడంలేదు. ఇదేదో ఇంద్రజాలంలా వుంది. నేను మిమ్మల్ని ఎందుకు చూస్తున్నానో నాకే తెలియడం లేదు. మిమ్మల్ని నా జీవితంలో ఇదే మొదటిసారి చూడడం."

"ఎంత వెర్రివాడివి మధుమూర్తీ! నేను కామరూపం గల యక్షిణీ కన్యనోయ్! ఏ రూపమైనా ధరించగలను, ఏ భాష అయినా మాట్లాడగలను. ఒకసారి జామతోటలో పంచవన్నెల రామచిలుకగా మారి నీ మీద వాలాను-గుర్తుందా?"

"ఔను, గుర్తుంది. ఆ రోజున నా మీద ఓ రంగుల రామ చిలుక వాలింది."

"మరి ఇంకేం? ఆ రామచిలుకను నేనే! నువ్వంటే నాకిష్టం-అందుకని అలా వాలాను."

"ఒకనాడు నీకు నదీతీరంలో ఓ బంగారు చేప కన్పడింది గుర్తుందా?"

"ఔను- నిజమే! ఇదేమిటీ బంగారు చేప అనుకున్నాను. చూస్తుండగానే అది నదిలోకి జారిపోయింది. బంగారు చేప కన్పడిందని చెపితే ఎవరూ నమ్మరనీ, ఎగతాళి చేస్తారనీ చెప్పలేదు.

ఆ బంగారు చేప కూడా మీరేనా?" నివ్వెరపోతూ అడిగాడు మధుమూర్తి.

"నేనే! నీకు కావాలని అలా కన్పడ్డాను. నేను తలుచుకుంటే ఓ పుష్పంగా మారగలను. ఓ పండుగా నీ దగ్గరికి రాగలను. ఒకసారి బాలాకుమారి వేషంలో నీ ముందు నిలబడగలను. మరోసారి రూపాన్ని వదిలి ధ్వనిగా మారి, కోకిల పాటగా నీ చెవిలో దూరగలను. వెలుగుగా- వెన్నెలగా-రంగుతో- రూపంతో- ధ్వనితో-సంగీతంతో- స్పర్శతో- రుచితో- సువాసనతో- ఎలా కావాలంటే అలా వచ్చి నిన్ను తాకగలను. తెలిసిందా?"

ఇలా మాట్లాడి ఆమె నదిలోకి దిగింది.

"సుందరీ! అప్పుడే వెళ్ళి పోతున్నారేమిటి?" మధుమూర్తి వెంట బడ్డాడు.

ఆమె మళ్ళీ నవ్వింది. ఆ నవ్వు ఓ తెల్లని తెరచాపగా మారింది- నదిలో ఓ పడవ వస్తున్నది. అందులో కృష్ణదేవరాయల వారు కూర్చొని వున్నారు.

"పొట్నూరు వద్ద జయస్తంభం నాటి గజపతులను పాదాక్రాంతులను చేసుకొని తిరిగివస్తూ, కనకదుర్గమ్మకు కానుకలు సమర్పించి. అమరేశ్వరుని దర్శనానికై వెళ్తున్నారు రాయలవారు, మధుమూర్తీ!" సుందరి వ్యాఖ్యానించింది.

నిజమే!

పడవలో నుండి "మూరురాయరగండ, సాహిత్యసమరాంగణ సార్వభౌమా-విజయీభవ" అని నినాదాలు విన్పడుతున్నాయి.

సుందరి కృష్ణానదిలో నుండి నడుచుకుంటూ ముందుకు సాగిపోతున్నది. పడవ అదృశ్యమైంది.

"సుందరీ-సుందరీ!" మధుమూర్తి వెంటబడ్డాడు. మోకాళ్ళ లోతు నీళ్ళువచ్చాయి.

ఆమె ఇంకా ముందుకు సాగిపోతున్నది.

"సుందరీ! ఎక్కడికి వెళ్తున్నారు దేవీ?"

ఆమె నవ్వుతూ ముందుకుసాగింది. ఆ నవ్వు తెల్లని తెరచాపగా మారింది-ఇంకో పడవ. అందులో నుండి మంత్రాలు విన్పడుతున్నాయి.

"ఓం నమో వామదేవాయనమః జేష్టాయనమః శ్రేష్టాయనమః కాలాయనమః కాలరుద్రాయనమః."

ఇంతలో పడవలోనుండి ఓ పద్యం విన్పించింది.

"శ్రీపతి వాక్పతి ముఖ్య మ
హా పురుషుల నెరగనో పరతి వాఙ్మనస
వ్యాపారమైన నీ నిజ
రూపము నేనెట్టిదని నిరూపింతు శివా."

"ఎవరా పద్యం-గంభీర కంఠధ్వనితో చదువుతున్నారు?" మధుమూర్తి అడిగాడు.

"చూచావా నా మహిమ! నీకు పడవ కన్పడటమే కాదు— పద్యాలూ ధ్వనులూ కూడా విన్పడుతున్నాయి. ఆ పద్యం చదువుతున్న మహా పురుషుని పేరు మల్లికార్జున పండితారాధ్యుడు. శ్రౌతశైవ పీఠాధిపతి. రాజగురువు. అమరేశ్వరస్వామి దర్శనానికై వెళ్తున్నాడు. ఆయన ఇప్పుడు చదివిన పద్యం 'శివ తత్వసారం' అని ఆయన వ్రాసిన శతకంలోని మొదటి పద్యం" అన్నది సుందరి.

"ఆశ్చర్యం-మహాశ్చర్యం! శివతత్వసారం ఇప్పటికి ఎనిమిది వందల సంవత్సరాలనాటి పుస్తకం. ఈ మల్లికార్జున పండితుడు ఆ నాటివాడు. వెలనాటి చోడుడు, పానుగంటి ఉపయావనీపుడూ, బెలిదేవు వేమనారాధ్యుడూ, బసవేశ్వరుడూ ఈయన సమకాలికులు. అంటే పండితారాధ్యులవారు కృష్ణానదపై ప్రయాణంచేస్తూ ఈ పద్యం పాడి ఎనిమిదివందల ఏళ్ళయిందికదా?"

"ఔను మధుమూర్తీ- అది నీ దృష్టిలో. కాని ఈ పద్యం ఎక్కడికీ పోలేదు. ఇక్కడే ఈ వాయువులోనే అంతర్లీనమైంది. ఎప్పుడు కావాలంటే అప్పుడు నీకు నేను విన్పించగలను. పండితారాధ్యులవారేమిటి-అప్పటికి ఇంకా వెయ్యేళ్ళ ముందున్న ఆచార్య నాగార్జునులవారు కూడా నీకు కావాలంటే కన్పడుతారు, వీళ్తో

మాట్లాడుతారు మధుమూర్తీ!" ఇలా మాట్లాడుతూ సుందరి కృష్ణా నదిలోని లంకల లోపలికి వెళ్ళిపోయింది.

"సుందరీ—సుందరీ! యక్షిణీ..." అంటూ మధుమూర్తి ఆమె వెంట వెన్నెలలో పరుగెత్తసాగాడు.

# 2

రామసుబ్బయ్యగారు ప్రత్యూష పవనాంకురాలు పైన పడకముందే నిద్రలేచి సాంధ్యకృత్యాన్ని నిర్వహించి సావిత్రిని జపించి సైకత స్థలిలో కర్మసాక్షికి మొక్కి అప్పుడు పొడిబట్టలు కట్టుకొని తడి బట్ట లను తడికెలపై ఆరేస్తూవున్నాడు.

అయన గానంచేసే సుప్రభాతం జామతోటల్లోని పుంస్కో కిలాలాపాలతో పోటీ పడుతున్నది. ఈ ఆలాపన ఆకస్మికంగా ఈ హేమంత సుముహూర్తంలో ఉషస్సుషమలో వచ్చినదికాదు. ఆయనకు ఊహవచ్చిన నాటినుండి ఇలాగే చేస్తున్నాడు. ఇలా యాభై కిపైగా వసంతాలు ఇప్పటికి ఇలా గానంచేస్తూనే గడిపాడు. అందులో ఇదొక సుదినం.

సూర్యుడు క్రమంగా పైకివస్తున్నాడు. వెంకన్న పందిళ్ళ నుండి గిల్లి గూడు పొట్లకాయలు కోసి తెచ్చి, మహాలక్ష్మమ్మగారి చేతికిచ్చాడు.

శ్యామల పాలను తీసుకొని లోనికి వెళ్తున్నది.

"ఇంటికాడ నీలిమందుగాబులకాడ పనివుంది రాలేదు చిన్న మ్మాయిగారూ! ఇప్పుడే పాలుతీస్తున్నారేంటి?"

"లేదురా! నీవు రాకపోయే సరికి మారాముపెట్టింది మంగళ" అన్నది శ్యామల.

"మధుబాబుగోరు ఇంట్లో వున్నారా, తోటల్లోకి పోయినారా?" అని అడుగుతూ రామసుబ్బయ్యగారి కళ్ళల్లోకి చూచి ఠక్కుమని ఆగిపోయాడు వెంకన్న.

"బాబు ఇంట్లోనే వున్నాడులే వెంకన్నా! ఇంకా లేచాడో-లేదో!" అన్నది మహాలక్ష్మమ్మ, బిందెతీసుకొని నదికి మంచినీళ్ళకు పోతూ.

చదువుతున్న సుప్రభాతం మధ్యలో ఆపి-అదోలా తలడింగించి-రామసుబ్బయ్యగారు చిరుకోపంతో మహాలక్ష్మమ్మగారి వైపుచూచాడు.

ఆ చూపుల భావం ఆమెకు తెలుసు. గతయాభై సంవత్సరాలుగా అలా సుబ్బయ్యగారి చూపులలోని సూత్రాలకు ఎలా భాష్యాలు చెప్పాలో, ఏమేమి వ్యాఖ్యానాలు చేయాలో మహాలక్ష్మమ్మ సంపూర్ణంగా నేర్చుకున్నది.

కొడుకు ఇంకా నిద్రలేవక పోవడానికి కారణం ఆమేనని ఆయన భావం.

వెంకన్న ఇక మాట్లాడకుండా ఆవునూ దూడనూ తోలు కుంటూ వెళ్ళాడు.

"అరేయ్ వెంకన్నా!" శ్యామలకేక.

"ఏమ్మా?"

"దూడకు గిట్టలదగ్గర గీచుకుంది-చూడు!"

వెంకన్న చూచాడు. "అదేం లేదమ్మాయిగోరూ! ఏదో కంప కొంచెం గీసుకున్నదంతే! హెయ్-హేయ్" అంటూ తోలుకుంటూ పోయాడు.

రామసుబ్బయ్యగారు శ్యామలవైపు విలక్షణంగా చూచాడు.

శ్యామల వెంటనే దాని భావం గ్రహించి లోనికి పరుగెత్తు కుంటూ పోయింది. పడమటింటి తలుపు తట్టింది. ఉహూఁ-సమాధానం లేదు. మళ్ళీ-మళ్ళీ-పిలుపు.

కాసేపటికి తలుపు తెరుచుకుంది.

"ఇంకా మొద్దు నిద్రేనా అన్నయ్యా? పొద్దుపోయి రాత్రి వచ్చావు- నిజమేకాని, అవతల నాన్నచూడు" అంటూ లోనికి ప్రవేశించి తెల్లబోయింది శ్యామల.

వ్యాస పీఠంతో కిటికీవద్ద రచనా సామాగ్రి అమర్చివుంది.

ఎంతసేపటినుండి యోగనిష్టలో వున్నాడో ఈ నవభావుకుడు-శ్యామల కేకతో లౌకిక జగత్తులోకి వచ్చాడు.

"క్షమించు అన్నయ్యా!"

మధుమూర్తి చిరునవ్వునవ్వాడు. నవ్వాడనే కాని భావజగత్తు నుండి ఇవతలికి వచ్చి తన మాటలు వినిపించుకునే నవ్వుతున్నాడని శ్యామలకు నమ్మకం కలుగలేదు.

ఆ నవ్వులో ఒక యాంత్రికతా, నిర్లిప్తతా, అంతరంగికమైన ఆవేశానికి నివురు కప్పిన దశా- గోచరమైనాయి.

"నాన్నగారు కోప్పడుతుంటే వచ్చాను. పైగా ఇవ్వాళ డాక్టరుగారింట్లో పెండ్లి కేళ్ళాలాయె!"

"ఏం పెండ్లి?" మధుమూర్తి వాస్తవలోకంలోకి వస్తున్నాడు. శ్యామలకు స్పష్టంగా అది తెలుసు. ఊహా జగత్తులో మధుమూర్తి నేత్రాంచలాలెలా మెరుస్తాయో ఆమెకు చిన్నప్పటి నుండి గుర్తే! వాస్తవలోకంలో అవి ఎలా నటిస్తాయో ఆమెకు చక్కగా తెలుసు.

"అదే, రాయపూడి కరణంగారి కూతురు నిస్తున్నారు కదా!"

మధుమూర్తి పూర్తిగా ఈ లోకంలోకి వచ్చాడు. కిటికీలో నుంచి ఆకాశాన్ని చూడటం ఆపేశాడు.

పడమటి ఆకాశం-సూర్యోదయమైనా ఇంకా మంచుపొరల తోనే నిండివుంది.

"శ్యామలా! ఈ గీతాన్ని వింటావా?"

"బాబూ! నీ కవిత్వానికో దణ్ణం, అవతల బోలెడంత పని వుంది."

"కాదు శ్యామలా! హేమంతాన్నంతా నా గీతంలో పిండి ప్రవహింపజేశాను."

"ప్రవహించనీ, కృష్ణతోపాటు పోటీగా పొంగనీ. గీతాలూ-సంగీతాలూ ఈ పొద్దున్నేకాదు...."

అన్నయ్య కళ్ళు మారాయి. సరికొత్త నీడలు.

"మాధవయ్యగారూ! వినిపించండి మీ గీతం."

మధుమూర్తి మాట్లాడలేదు.

ఈ యింట్లో తన కవిత్వాన్ని ఆదరించేదీ, ప్రోత్సాహ మిచ్చేదీ చెల్లెలొక్కతే! ఇవ్వాళ ఆమె కూడా...

"విన్పించండి మహాకవిగారూ!"

మధుమూర్తి కొంచెం ఉత్సాహంతో వ్యాసపీఠంపై గేయం తీసుకున్నాడు. చదవడానికి గొంతు సవరించుకుంటున్నాడు.

"అమ్మాయ్!" తండ్రి కేక.

"వస్తున్నా నాన్నా!" శ్యామల వెళ్ళిపోయింది పరుగున.

మధుమూర్తి ఒక్కక్షణం నిర్లిప్తంగా అలాగే నిలబడి పోయాడు.

"ఇంతకీ వాడు పెళ్ళిపందిట్లోకి రాడా ఏమిటి? కనుక్కో!"

"ఎందుకు రాడు నాన్నా?"

"ఆ- వచ్చే మొగమే! చూడమ్మా- నాకవతల పరిమిలో కొంచెం పనివుంది. అది చూచుకొని తిరిగి రావాలి. ఈ లోపల వాణ్ణి ఒకసారి జామతోట చూచి అటు గుండా పెళ్ళికి వెళ్ళమని చెప్పు."

"అట్లాగే నాన్నా!"

"అట్లాగే కాదు. వాణ్ణి వెంటనే బయలుదేరమను. ఆ వెర్రి మొర్రి కాగితాలు మూలపడేయమను."

"అట్లాగే!"

"అట్లాగే అంటే కాదు—నా పూజ సామాగ్రిని డాక్టరు గారింటికి చేర్చు. అక్కడే మధ్యాహ్నం పూజా, భోజనమూ."

"అట్లాగే."

"అట్లాగేట-అట్లాగే." కొంచెం విసుగుతో వాకిట్లోకి వచ్చాడు. ఎదురుగా నీళ్ళబిందెతో మహాలక్ష్మమ్మ.

"మీకు విజయం అవుతుంది వెళ్ళండి- ఆ పనేమిటో కాని." చిరునవ్వు నవ్వింది భార్య.

రామసుబ్బయ్యగారు మాత్రం గంభీరంగా బయటకు వెళ్ళి పోయారు.

అప్పుడు నడింట్లోకి వచ్చి నిలబడ్డాడు మధుమూర్తి.

మధుమూర్తి-మధువుమూర్తీభవించిన రూపం. కొంచెం రేగిన ఉంగరాలజుట్టు-గుండ్రని ముఖం-అందమైన కోటేరులాంటి ముక్కు-మెరిసేకళ్ళు-ఎర్రని బింబాధరాలు.

"అరేయ్ మాధవుడూ! ముఖం కడుక్కొని ఓసారి జామతోట దాకా వెళ్ళిరాబాబూ! వెళ్ళకపోతే మీ నాన్నగారు కోప్పడతారు." మహాలక్ష్మమ్మ నీళ్ళబిందె దింపి పొయ్యి సరిచేస్తూ చెప్పింది.

"అలాగేనమ్మా!" మాట్లాడకుండా అలాగే వీధిలోకి నడిచాడు మాధవుడు.

మహాలక్ష్మమ్మ వంటకై కట్టెలను సరి చేస్తున్నది. మంట చిటపట లాడుతున్నది. మంచుకామె శరీరం శీతల వాయువు లతో పరివేష్టింపబడిందే కాని, ఆమె హృదయం చాలా వెచ్చగా వుంది. కృష్ణలో స్నానం చేసినా గుండె చల్లబడలేదు.

పొయ్యిలో కట్టెలు....ఆమె గుండె కూడా....

పూర్వం మాధవుడు చాలా గొప్ప వాడవుతాడనీ ఆ డాక్టరు కొడుకు లాగే దేశదేశాలూ తిరిగి లక్షలు ఆర్జిస్తాడనీ కలలు కన్నది. కాని తన కలలు కల్లలయినాయి. కొడుకిలా తయారైనాడు. చదువు కున్న వాళ్ళు అందరూ అంటారు-కొడుకు చాలా తెలివైన వాడని. తనకా నమ్మకం ఇప్పుడిప్పుడే సన్నగిల్లు తున్నది. ఆయనకు అసలా నమ్మకమే మొదటి నుండీ లేదు.

ఒక రోజూ జామతోటను చూడమని పంపారు మధుమూర్తిని. అలాగేనని వెళ్ళాడు.

మధ్యాహ్నం పాలేరు వెంకన్న కృష్ణ కరకట్ట మీది గుండా నడిచి వెళ్తూ చూచేసరికల్లా దూరాన ఏదో ధ్వని.

గుండె గుభేలుమంది.

వెళ్ళి చూచాడు. తన ఊహ నిజమే అయింది.

నది మీద బల్ల కట్టుపై వచ్చే పిల్లలు కరకట్ట దిగి రామ సుబ్బయ్యగారి తోటలో జామపండ్లు కోసుకు పోతున్నారు.

"మాధవయ్యగారూ!" పరుగు పరుగున కేకలు పెడుతూ వచ్చాడు వెంకన్న.

వెంకన్న తడాకా పిల్లలకు తెలుసు. పారిపోయారు వెంటనే.

తోటలో మధుమూర్తి లేడనుకున్నాడు వెంకన్న.

కాని అలా లేకుంటేనే బాగుండేది. మధుమూర్తిపై మంచి అభిప్రాయం మిగిలేది.

తోటకు మధ్య ఆయన ఎప్పుడూ కూర్చునే సపోటా చెట్టు పక్క నీటిబుగ్గవద్దనే కూర్చొని వున్నాడు.

గుంపులు గుంపులుగా జలపక్షులు తోటలో విడిది దిగాయి. లబోదిబోమని మొత్తుకున్నాడు వెంకన్న.

చిరునవ్వు నవ్వాడు మధుమూర్తి.

"అన్యాయమైపోతుందాడి తోట మాధవయ్యగారూ!"

"పోనీరా! ప్రకృతిమీద మనకేం అధికారముంది?"

మాధవయ్య మాటా, భావమూ తనకు పూర్తిగా తెలియలేదు కాని, మొత్తానికి పక్షులూ, పిల్లలూ పండ్లు తినడమే మంచిదని ఆయన సపోర్టు చేస్తున్నాడని మాత్రం అర్థమైంది.

పక్షులకు కూడా ఎలాగుర్తో- కర్రతో వెంకన్న తోటమధ్య నిలబడగానే పారిపోయాయి.

ఈ సంఘటనను వెంకన్న చెప్పీ చెప్పకుండా మెల్లగా రామ సుబ్బయ్యగారితో చెప్పాడు. చెప్పకుంటే ఎలామరి? అనాడు రామ సుబ్బయ్యగారికి వచ్చిన కోపం, ఊళ్లోవాళ్ళు లోగడ ఎప్పుడూ చూడనే లేదట! దక్షాధ్వరంనాటి వీరభద్రునివలె ఉవ్వెత్తున విజృంభించాడు కొడుకుపైన.

కొడుకు ఉలకలేదు___పలకలేదు.

వెంకన్న చెప్పిన ఉదంతం విని, నాటినుండీ బోరుపాలెం గ్రామ వాస్తవ్యులందరూ మధుమూర్తికి పిచ్చేనని నిశ్చయించు కున్నారు. దీనికి ప్రోద్బలమైన మరికొన్ని సంఘటనలు వారి కప్పుడు గుర్తొచ్చాయి.

"అనాడు చూస్తే ఏమో ననుకొన్నాను- ఈ విషయం విన్నాక అర్థమౌతున్నది. నేనొక తమాషా చూశాను" అన్నాడొకడు.

"ఏమిటది?" అంతా ఒకేసారి ప్రశ్నించారు.

అప్పుడతడు చెప్పాడు-"నేను లంకలకాడికి మధ్యాహ్నం బువ్వ తీసుకు పోతుండానర్రా! అప్పుడేం జరిగిందంటే...." మళ్ళీ కొంచెం సస్పెన్సుకై ఆపాడు.

"ఏం జరిగింది?" అంతా ఒకేసారి ప్రశ్న.

"ఒక జరగకూడనిదే జరిగింది" అని గొంతును తాను చెప్పబోయే విషయానికనుగుణంగా సర్దుకొని తక్కువ ధ్వనితో చెప్పాడు ఏదో రహస్యం చెపుతున్నట్లు- "మాధవయ్యగారి గొంతు వినపడు తుండాది. ఏమిటా అని చూద్దునుకదా, అక్కడి గున్న మామిడి అంటు లేమా—దాన్ని రెండుచేతులా కౌగలించుకొని ముద్దుపెట్టు కుంటున్నాడ్రా! ఏమా అని దగ్గరకుపోయి చూద్దును—మనిషి ఈ లోకంలోలేడు. కళ్ళ వెంట నీళ్ళు ఉన్నట్టుండి ఒక్కసారిగా...." కథకుడు వాళ్ళు జలదరించేటట్లు ఆపాడు.

శ్రోతలు భయంతో, "ఏమైంది?" అన్నారు కళ్ళు పెద్దవిచేసి.

"అయ్యేందుకేముంది? ఒక్కసారి పాటో పద్యమో ఏదో లంకించుకున్నాడ్రా! దానితో తారెత్తి నేను ఒకటే పరుగు." కథకుడు నిశ్వసించాడు తన బాధ్యత ముగిసినట్లు.

శ్రోతలందరిలోనూ ఏదో తీవ్రత ఆవేశించింది.

"నిజమే! ఒకనాడు పిచ్చెత్తినోడల్లే సందేళ నదొడ్డున పరుగెత్తడం నేను చూచాను." మరొక సాక్ష్యం.

"ఇంక అనుమానమేముంది? ఇదంతా దేని చేష్ట అంటావ్?"

"బ్రహ్మరాక్షసి కావచ్చు." ఒకని తీర్మానం.

"అందుకు ఆధారం ఏమిటి?" మిగిలినవారి ప్రశ్న.

"ఏమంటే—ఒక రోజున మా బుడ్డోడు తోటలోకి పోతేను, వాణ్ణి చూచి 'ఓహో! నాదేవీ! రావే రావే' అంటూ వాణ్ణి పట్టుకోబోయాడట. భయంతో పరుగెత్తుతూ ఇంటి కొచ్చాడు వాడు."

ఈ 'దేవీ' శబ్దంతో వారికి నూకాలమ్మ జ్ఞాపకం వచ్చింది.

"ఇది నూకాలమ్మ మహిమేనని నాఉద్దేశం" అన్నాడొకడు.

"నేను ఇంకో విచిత్రం చూచాను" అన్నాడు జామతోటల్లో కాపలావుండే రాజయ్య.

"ఏమిటీ—ఏమిటీ?" అంతా చెవులు నిక్కబొడుచుకొని అడిగారు.

"మధుబాబు ఒకనాడు ఒంటరిగా నా తోటలో కూర్చున్నాడు. 'ఊఁ-ఊఁ-ఊఁ-ఊఁ-'అంటున్నాడు. నేనది చాలాసేపు గమనించినాను. చివరకు ధైర్యంచేసి దగ్గరికి వెళ్ళాను.

"ఎవరితో బాబూ! మాట్లాడుతున్నారు?" అని అడిగాను.

"రాజయ్యా! సుందరి కన్పించిందిరా! ఆమె ఓ అందమైన కథ చెప్పింది" అన్నాడు మధుబాబు.

"ఏం కథ బాబూ?" అని అడిగాను నేను.

"అదేరా-అమరావతిలేదూ. దీనికి పూర్వం ధాన్యకటకమని పేరు వుండేది. ఇక్కడ తెలుగురాజులు పరిపాలించేవారు. ఆ రాజులు ఎలా పుట్టారో-ఆ కథ- సుందరి నాకు చెపుతూ వుందిరా" అన్నాడు మధుబాబు.

"ఆ కథేమిటి బాబూ?" అని అడిగాను. అప్పుడు బాబు ఏదో కథ చెప్పినాడు. ఎవడో నాగరాజు దారినిపోతూ ఓ అమ్మాయిని ప్రేమించినాడంట. ఆ పాముకూ ఆమెకూ ఒక కొడుకు పుట్టినాడంట. ఆయనపేరు గుణాఢ్యుడంట- ఇదో కథ. ఇంకో కథ ఏమిటంటే, సింగంమీద ఓ పిల్లవాడు ప్రయాణం చేస్తున్నాడంట. వాణ్ణి ఓ రాజుగారు తెచ్చి పెంచుకున్నారంట. ఆ పిల్లవాడే తెలుగువాళ్ళకు అందరికీ ముత్తాతలకు ముత్తాతట! ఏదో ఇట్లాంటి కథలన్నీ చెప్పినాడు మధుబాబు. ఇవన్నీ తనకు ఎవరో సుందరి చెప్పిందట. నేను చూచినా న్రా-అక్కడ ఆడమనిషేమిటి-అసలు పిట్ట పురుగులేదు" అన్నాడు రాజయ్య.

దీని సారాంశం మెల్లగా రామసుబ్బయ్యగారి చెవుల్లో కూడా పడ్డది. అయినా ఆయన ఏమీ మాట్లాడలేదు. గంభీరంగా ఊరుకున్నాడు.

అయితే ఏ పనీ ఇక కొడుకు మీద వదల కూడదని మాత్రం నిశ్చయించుకున్నాడు.

అందుకే ఈ ఉదయం అంతగా చెప్పడం:

తోటలో జామిపండ్లను మనుషులు లాంచీ కెత్తుతున్నారు.

వెంకన్న పర్యవేక్షణ కూడా వుంది. అయినా ఒకసారి చూడడానికి మాత్రమే పంపుతున్నారు కొడుకును.

రామసుబ్బయ్యగారు పరిమి వెళ్ళారు.

మధుమూర్తి ఒక మఫ్లర్ తలకు చుట్టుకొని బయలుదేరాడు.

"ముఖం కడుక్కో అన్నయ్యా-ముందు." శ్యామల కేక.

మధుమూర్తి ప్రతిరోజూ ఉదయం ఆవు పాలు నురుగులతో ఒక గ్లాసు త్రాగడం అలవాటు.

"లేదమ్మా! ఈ హేమంత శుభ ముహూర్తంలో నాలో నదో కొత్త భావావేశం చెలరేగింది. మనసు మనసులో లేదు" అంటూ అలా నడిచి పోతూనే వున్నాడు.

శ్యామల మారు మాట్లాడకుండా వెనుకకు వచ్చింది.

మధుమూర్తి కరకట్ట ఎక్కి చూచాడు.

కృష్ణా మహాదేవి నిశ్చలంగా ప్రవహిస్తున్నది. అమరావతిలో అమరేశ్వరుని పాదపద్మాలు స్పృశించి ఆ దివ్యగంధ సంస్పర్శతో బోరుపాలెం మీదుగా కనక దుర్గా కళ్యాణ వేదికను అందుకుంటున్నదా మహాతల్లి!

ఎన్నాళ్ళ నుండి? ఎన్నేళ్ళ నుండి? ఏమో! ఎవరు నిర్వచింప గలరు?

మధుమూర్తి భావతీవ్రతతో చలించి పోతున్నాడు. 'దేవీ! కృష్ణా! ఎప్పటి దానవమ్మా నీవు! శాత వాహన రాణుల కుచకుంకుమ ముల సౌరభంతో సహస్రాబ్దాల క్రితం పరవశించిన మూర్తివేనా? ధరణికోట ప్రభువుల యుద్ధ నౌకలను చుంబించిన వేయేండ్ల నాటి అమరమూర్తి వేనా నీవు? బౌద్ధ సన్యాసినీ గణస్నాన ఘట్టమై చరిత్రలో చెరుగక నిలిచిన దివ్యమూర్తివేనా నీవు? నాగార్జున పాదస్పర్శతో పరుసవేదిగా మారినభవ్యమూర్తివి నీవేనా తల్లీ? అమ్మా, కృష్ణమ్మా! ఎందరి కవి రాజులగుండెల గలగలలో యివి! ఎందరు సీమంతులు వాడిన జలకపు పరిమళమో యిది! పరవడిలో-జలజలమో, చర చర గాజుల గల గలయో....' మధుమూర్తి దృశ్య జగత్తును మరచి గద్యానికీ వచనానికీ మధ్య నున్న స్థాయిలో భావాన్ని శబ్దాలలో బంధించి ఉద్వేగంగా వెళ్ళి కృష్ణానదిలో పడిపోయాడు.

కృష్ణ, వర్షాకాలం తప్పితే మిగిలిన ఏ కాలంలోనూ బోరుపాలెం వద్ద ప్రమాదకరం కాదు సరికదా, శరత్తులో వర్షాలు తక్కువగా ఉన్న ఒక్కొక్కప్పుడయితే, ఎంత దూరం పోయినా మోకాలు లోతునే వుంటుంది.

సుప్రభాతాన మంగళస్నానం చేశాడు మధుమూర్తి! దూరాన మంగళ వాద్యం! బాజా.., డోలూ మ్రోగుతున్నాయి పెళ్ళిపందిటిలో. కాలంలో అనుభూతి పరంపర కడిగి వేయబడ్డ పిమ్మట, తరంగిణిలో భావలహరి తరిగి కరిగి పోయిన పిమ్మట, ఎప్పటికో ఒకప్పటికి మధుమూర్తి నది నుండి లేచాడు. నేరుగా ఇంటి ముఖం పట్టాడు. తడిగుడ్డతో వచ్చిన అన్నయ్యను చూచింది శ్యామల.

"అన్నయ్యా! పెళ్ళి చూడడానికి రావేమిటి?" గద్వాల చీరలో మెరుస్తూ నిలబడి అడిగింది.

మహాలక్షమ్మగారు మాత్రం పట్టు చీరె కట్టుకున్నారు. అది ఎన్నేళ్ళ క్రిందటిదో ఎవరికీ తెలియదు కాని, ఆమె అమూల్యమైన సంపదలలో అదొకటి.

ఇంటిని చూచేసరికి తండ్రి తనను తోటకు వెళ్ళమన్న మాట గుర్తొచ్చింది.

"నాన్నగారు రాలేదా?"

"ఇంకా లేదన్నయ్యా! పని మీద పరిమి దాకా వెళ్ళారు కదా! మనల్ని ముందు పెళ్ళి పందిటికి వెళ్ళమన్నారు."

కుగ్రామంలో ఒక ఇంట్లో పెళ్ళంటే అది అందరికీ సంబంధించిన సాంఘికోత్సవమే!

"మీరు పదండమ్మా! నేను కొంచెం ఆగి వస్తాను."

శ్యామలకు అనుమానమే-అన్నయ్య దొడ్లోని ఏ బంతి పూవో చూచి తిరిగి జగత్తు మరిచిపోతాడేమోనని!

"అమ్మా! నీ వెళ్ళు. నేనో పది నిమిషాల్లో వస్తున్నా."

మహాలక్ష్మగారు మాట్లాడకుండా వెళ్ళిపోయారు.

పొందూరు పంచెల చాపు తీసింది శ్యామల. అన్నయ్య తలకు నూనె రాచింది.

"శ్యామలా! నేనొక ప్రశ్న అడగనా?"

"ఏమిటన్నయ్యా అది?" మధుమూర్తిని కూర్చోబెట్టి తల దువ్వుతూ అన్నది.

"ఏమీ లేదు-నేను నిజంగా పిచ్చివాణ్ణే నంటావా?"

శ్యామల దీనినంత శ్రద్ధగా పట్టించుకోలేదు.

"పద- పద త్వరగా. ఆఁ_నీవు పిచ్చివాడివేమిటన్నయ్యా-విన్నన్న వాళ్ళు పిచ్చివాళ్ళు కాని." శ్యామల కుంకుడు నురుగుతో చేతిని కడుక్కొని అన్నయ్య కొరకు మెత్తని నున్నిపిండి కొంకాయ చిప్పలో పోసి తెచ్చి పెట్టింది.

"అదికాదమ్మా! ఈ ఊళ్ళో నన్ను చాలా మంది పిచ్చివాడిగా భావిస్తున్నారని నాకు తెలుసునమ్మా!"

"అయితే ఇంకేం? ఆ పిచ్చి పనులు మానితే సరి." రేగిన తల ముంగురులను సరి చేసుకుంటూ అన్నది

"ఎలా మానడం? ఆ భావుకతా, ఆవేశమూ నేను రమ్మంటే వస్తున్నది కనుకనా పొమ్మంటే పోవడానికి? ఏం చేయనమ్మా నేను? నా చేతిలో లేని పని యిది. ఎన్ని జన్మల శాపమో యిది?" మధుమూర్తి అలాగే నిలబడిపోయాడు శిలాప్రతిమలా.

శ్యామల మాత్రం అవతల పని తొందర దృష్ట్యా ఏమీ ఆలస్యం చేయడం లేదు. అన్నయ్య భావుకతతో ఆనందిస్తూ కూర్చునే సమయం కూడా కాదిది. తన ముఖాన వున్న కుంకుమను సరి చేసుకొంది.

"అన్నయ్యా! నీకు కల్యాణ తిలకం దిద్దే రోజెప్పుడు?" ఆప్యాయంగా ప్రశ్నించింది.

"చూడాలని వుందా అమ్మా?"

"అవునన్నయ్యా!"

"అయితే దానికి ఆలస్యం ఎందుకు? ఇప్పుడే అలంకరించు."

"బాగుంది వెట్టి." నవ్వింది-మల్లెపూలు కుప్పపోసినట్లుగా.

"నవ్వు కాదమ్మా- నీవు దేనిని కోరుకుంటే అవి వెంటనే జరుగవలసిందే!" మధుమూర్తి పట్టుబట్టాడు.

"పెళ్ళి నీకా? ఆ డాక్టరుబాబుకా?"

"డాక్టరుబాబు సంగతి నాకేం తెలుసు? కాని నా మనస్సు నిత్య కల్యాణమూర్తి- ఆఁ."

శ్యామల ముచ్చట చూడాలని, అన్నయ్య ముఖంపై తిలకం దిద్దింది. కొద్ది క్షణాలు చూచి తుడిపి వేయాలని- ఆమె సంకల్పం.

కాని, ఇంతలో-ఇంట్లో శబ్దంతో ఉలిక్కి పడింది. చేతిలోని

వస్తువుల నలాగే పట్టుకొని ఇంట్లోకి వచ్చి చూచేసరికి- తెల్లపిల్లి పాల కుండను దొర్లించింది! కుండ క్రిందపడ్డ శబ్దం!

శ్యామల భయపడి పోయింది! తల్లి తనను తప్పకుండా కేకలు వేస్తుంది. ఆ హడావిడిలో అన్నయ్య ముఖాన వున్న కల్యాణ తిలకం మాట మరిచిపోయింది.

"అన్నయ్యా! నీవు పద-నాకు కొంచెం ఆలస్యముంది."

మధుమూర్తి నడక సాగించాడు. పెళ్ళి పందిరి చేరాడు.

అయితే-అక్కడ వాతావరణం అనుకుంటున్నంత ఆహ్లాద కరంగా లేదు.

డాక్టరు నరసింహారావుగారు స్థానికమైన చిన్న వైద్యుడు. కాస్త స్థితి పరుడు. పదిమంది బలగాన్ని కూడ గట్టుకున్నవాడు. ఆయన, కొడుకు కరుణాకరంకి బస్తీలో మెడిసన్ చెప్పించాడు. గార్ల పాడు కరణం వెంకటాచలపతి గారి కుమార్తె హేమలతను కరుణా కరాని కివ్వాలని నిశ్చయించారు. కరణంగారి ఇల్లు కూడా అక్కడే వుంది. కరణీకం మాత్రం గార్లపాడులో.

మధుమూర్తి కొంత భావ కవి రచించిన 'కల్యాణకింకిణి' జ్ఞాపకం వచ్చింది. 'ఓహో, ఏమా కల్పన! అందాన్ని 'పిండి' అక్షరాలలో నింపాడు. ఆయన జన్మ చరితార్థం.' ఇలా మననం చేసుకొంటూ పెళ్ళి పందిట్లోకి వెళ్ళే సరికల్లా, మంగళవాద్యాలకు బదులు పెద్దగా కేకలు వినబడుతున్నాయి. మధుమూర్తి ఆకస్మికంగా వాస్తవలోకంలోకి వచ్చి చూచాడు___ఒక భయంకర దృశ్యం!

పీటలమీద పెళ్ళి కొడుకు,పెళ్ళి కూతురు కూర్చునే వున్నారు.

కరుణాకరం తండ్రి నరసింహారావుగారుమాత్రం నృసింహావ తారాన్ని ధరించి వేంకటాచలపతిని తిడుతున్నాడు. బంధువులంతా బిక్కచచ్చిపోయారు. ఎవరి నోటామాటరావడం లేదు. పురోహితుడూ ఒకరిద్దరు పెద్దలూ సర్దబోయి నిప్పు తీవ్రంగా వుండటంతో తమ చేతులు కాల్చుకోలేక వెనక్కు తగ్గారు. మధుమూర్తికి విషయం పూర్తిగాఅర్థంకాకపోయినా, సారాంశం మాత్రం గ్రహించగలిగాడు.

వెంకటాచలపతి, నరసింహారావును మోసబుచ్చాడట! ఇస్తానన్న

మాగాణి పొలం ఇవ్వలేదట! మామిడితోటా, జామతోటా కూడా కూతురు పేర పెడుతున్నాడట!

"ఇట్లాంటి వాడని తెలిస్తే నెలల క్రితమే వ్యవహారం పైసలా చేయించి శుభలేఖలు వేద్దును. తీరా పెళ్ళి పందిట్లో ఇలా నమ్మక ద్రోహం చేస్తాడనుకోలేదు మూర్ఖుడు!" అంటున్నాడు నరసింహారావు.

వెంకటాచలపతి కంఠం చాలా తగ్గుస్థాయిలో వుంది. బజార్లో రంకెలు వేస్తూ గర్వంగా తిరిగే వెంకటాచలపతి గొంతు ఇంత హీనస్వరంగా మారటం-ఇదే మధుమూర్తికి తొలిదర్శనం.

వెంకటాచలపతి మధ్యవర్తులకు చెప్పేదేమంటే తానుతోటలు పిల్లపేర పెడతానన్నానని, పిల్లను గుంటూరులోవుంచి త్వరలో చదువుకూడా తానే చెప్పించగలననీ, కొడుకు చిన్నవాడు కాబట్టి కాని, లేకుంటే మాగాణికూడా ఇచ్చే వాడ్నేనని- అన్నానని అంటాడు. కాని ఈ మహా ఝంఝ్యూ మారుతంలో ఏది నిజమో ఎలా నిర్ణయించడం? ఎవరు నిర్ణయించడం??

పురోహితునికి గత్యంతరంలేక, "అయ్యా! ఆ మాగాణీ కూడా ఇస్తామనండీ! లేకుంటే పెళ్ళి పందిరి అమంగళంగా మారిపోతుంది" అని మెల్లగా వెంకటాచలపతికి నచ్చజెప్పాడు.

వెంకటాచలపతి, విధవ ఆడపడుచు రంగమ్మగారు చాలా దూరంగా ముత్తైదులకు కొంచెం ఎడంగా కూర్చున్నదల్లా లేచి ముందుకు వచ్చి, "చూడు నరసింహం! నిన్ను నేను చిన్నప్పటినుండీ ఎరుగుదును. కాని మా జీవితంలో చూడాలనుకునే ఒకే ఒకముచ్చటను ఇలా రచ్చ కీడుస్తావనుకోలేదు. ఆ మాగాణి సీకిస్తే చలపతికి చిప్ప చేతికొస్తుందని తెలియదా?" అన్నది.

"ఁద్దమైన ఆడముండలూ నాకు సలహాఇచ్చేవాళ్ళే! ఎరక్కపోయి ఈ సంబంధానికి దిగాను." నరసింహంగారి ఘీంకారం! దానితో వివాహ సభ రభసన పడింది.

మధుమూర్తిని ఎవరూ చూడలేదు కాని, మధుమూర్తిమాత్రం అందరినీ పరిశీలించి చూచాడు- ముఖ్యంగా పెళ్ళి కూతురూ, కొడుకులను. కరుణాకరంతో తన కంత పరిచయం లేదు. చిన్నప్పటినుంచీ బస్తీలో కాన్వెంటులలోనే చదివాడు. చదువంటే ఏమోననుకున్నాడు

కాని ఇదేమి చదువు? తల్లిదండ్రులు పుస్తెకట్టడానికి ముందు బేరాలు సాగిస్తుంటే అన్నీ చూస్తూ, వింటూ, ఆనందం చిత్తగిస్తున్న ఐ స్త్రీ బిడ్డ. ఏమి చదువు? ఏమి సంస్కారం?

కట్నాల విషయంలో ప్రభుత్వం అంగీకరించదని శాసనాలు అవీ ఏవో వున్నాయని మధుమూర్తి విన్నాడు. కాని ఈ బోరుపాలెం బేరాన్ని ఏ ప్రభుత్వోద్యోగి ఆపుతాడు? ఏ మంత్రి విరోధిస్తాడు?? సమాజంలో పరివర్తన రానప్పుడు శాసనాలు ఎన్ని చేసినా ఒకటే!

ఇంతలో మధుమూర్తి దృష్టిమరొక కోణంలో ఆలోచించడం మొదలు పెట్టింది. అంతా తమ తమ మంచీ-చెడూ, ఆస్తీ-అంతస్తూ, బేరసారాలగుర్చే ఆలోచిస్తున్నారు కాని, పెళ్ళికూతురి మనసుగూర్చి, మమకారాలగూర్చి పట్టించు కుంటున్నవాళ్ళు ఇంత పందిరిలోనూ ఎవరైనా వున్నారా? కన్న తల్లిదండ్రులతోసహా ఎవరూ లేరనే అనిపించింది.

మధుమూర్తి కళ్ళముందు రాయప్రోలు సుబ్బారావుగారి స్నేహలత కన్పించింది. వంగదేశంలో నిజంగా జరిగినకథ! స్నేహలత వివాహానికై తండ్రి ఇల్లు అమ్ముతున్నాడు. సహించలేకపోయిందా లేతమనస్సు. రోషణ కుమారివంటి మరి కొందరు కన్యల అభాగ్య వృత్తాంతాలను కూడా విన్నది! గత్యంతరం లేక తండ్రి కొక లేఖ వ్రాపి గంగామాత నాశ్రయించింది.

స్నేహలత స్థానంలో హేమలత! గంగకు బదులు కృష్ణ! కలకత్తా జామపండుకు బదులు బోరుపాలెం జామ!

మధుమూర్తిని భావుకత ఆవేశించిది.

నరసింహారావు తిట్లకుదిగాడు.

వెంకటాచలపతి సహించలేక పోతున్నాడు. అయినా మ్రింగ లేక కక్కలేక శివునివలె విషాన్ని గొంతులో నిలుపలేక-అవస్థ పడుతున్నాడు.

కల్యాణ సాగర మథనంలో అమృతానికి ముందుగా హాలాహలం పుట్టింది. దానికే పెళ్ళిపందిటిలో వాళ్ళంతా స్థలంవదిలి పారిపోయే ప్రయత్నంలో వున్నారు.

"ఇంకా చూస్తావేం? లేరా పిగ్గు లేకుండా కూర్చున్నావ్!"

కొడుకును మందలిస్తున్నాడు నరసింహం.

మధుమూర్తి ఒక దృశ్యం ఊహించుకున్నాడు. కరుణాకరం లేచి నిలబడతాడు. తండ్రివైపు కోపంగా చూస్తాడు. లేదు-లేదు, కూర్చున్నచోటునుండి కదలడు. 'నాన్నా! ఇదేమి సంతలో బేరమా?' అంటాడు. బంధువులంతా హర్షధ్వానాలు చేస్తారు, నరసింహం విల విలలాడి పోతాడు.

మధుమూర్తి ఊహాగానం ఇంకా సాగక ముందే కరుణాకరం లేచి నిలబడ్డాడు. వివాహానికి కట్టిన నుదుటి భాషికం విప్పివేశాడు.

'ఇతడు విద్యావంతుడేనా?' ఆలోచింపసాగాడు.

పందిట్లో హాహాకారాలు.

పెళ్ళికూతురి తల్లి మూర్ఛపోయింది.

వెంటనే వెంకటాచలపతి నరసింహాన్ని శరణు వేడాడు— "అలాగే మాగాణి మీకిస్తాను-కల్యాణం జరిపించండి."

నాటకీయమైన సన్నివేశం!

"ఇంత దూరం వచ్చాక-"నరసింహంపట్టుదలకుపోతున్నాడు.

"అదేమీ కుదరదు. ముందు రాతలూ, కోతలూ సాగాలి." నరసింహం తరపు బంధువొకడు వంతపాడాడు.

"అలాగే! ముహూర్తం మీరకుండా ముందు కార్యకలాపాలు సాగించండి. తర్వాత ...." వెంకటాచలం ప్రాధేయం.

"ఈ ముహూర్తం కాక పోతే మరొకటి. ముందు మాగాణి వ్యవహారం తేలాలి."

"ఛీ! ముదనష్టపు సంబంధం!" రంగమ్మగారు కన్నీళ్ళతో విలపించింది.

ఆ మాట పెళ్ళి పందిట్లో అగ్నిని కురిపించింది.

"చపలమతీ! నీతో సంబంధం ఇక ఈ జన్మలో జరగని పని." నరసింహం కొడుకుతో చరచరా బయటకు నడిచాడు.

ఎటు చూచినా హాహాకారాలు.

మధుమూర్తిలో ఆవేశం ఉధృతమయింది.

శుభం అశుభంగా, ఆనందం విషాదంగా, ఆహ్లాదం ఏడుపుల పెడబొబ్బలక్రింద పరిణమించింది.

పెళ్ళికూతురు-ఆమెగూర్చి ఎవరూ అసలు యోచించడమేలేదు.

మధుమూర్తి కళ్ళముందు—నూతులూ, ఉరిత్రాళ్ళూ నాట్య మాడాయి. ఆ భయంకర దృశ్యం — ఇక సహించలేకపోయాడు. వెళ్ళి పీటల మీద తాను కూర్చున్నాడు.

పందిట్లో సూర్యుడు పశ్చిమాన ఉదయించినంత ఆశ్చర్యం!

"పురోహితుల వారూ! మీ కభ్యంతరం లేకపోతే నేను సూత్రధారణ చేస్తాను."

పందిట్లో ఆశ్చర్యాలు, గుసగుసలు, కరతాళధ్వనులు.

కొన్నిక్షణాల అనంతరం పురోహితుడు ఒకరిద్దరు ముఖ్యులైన పెద్దలతో సంప్రదించి, "వాయించండోయ్ బాజాలు" అని పిలుపునిచ్చాడు.

పంకంమధ్య పద్మం వికసించినట్లు పందిట్లో తిరిగి పెళ్ళి వాతావరణం.

శ్యామలలో ఆశ్చర్యం! మహలక్ష్మమ్మగారిలో ఆవేదన!

అందరికీ అక్షింతలు పంచారు, మంగళసూత్రాన్ని అందరిచేతా తాకించారు.

ఆలస్యంగా వచ్చిన రామసుబ్బయ్యగారు గుమ్మంలోకి వస్తూ ఎదురుగావున్న దృశ్యం చూచి తనకళ్ళను తానే నమ్మలేకపోయాడు. 'ఎండకు పైత్యానబడి కళ్ళు పొరపడుతున్నవేమో.... లేదు ..నిజమే!' ఏదో నోరెత్తి అనబోయేలోగా సూత్రధారణ జరిగిపోయింది.

కన్నీటి కొలనులో కూర్చున్న తామరపూవు- హేమలత మెడలో మధుమూర్తి కట్టిన మంగళసూత్రం మెరిసింది.

దిక్కులు పిక్కటిల్లేటట్లు డోళ్ళు, సన్నాయిలు మోగాయి.

# 3

హేమంతం తెలుగునాడును మంచుతెరలలో నింపింది. పండు మిరపలు కుంకుమతో మెరిసే ఎర్రని పెండ్లికూతుండ్రవలెనూ, బంతిపూలు పసుపుపచ్చని చీరెపై పొదిగిన జరీపూలవలెనూ

మెరుస్తుండగా, పరిచిన పట్టు తివాసీవలె పండిన పచ్చనిచేలు కల్యాణ తోరణాలుకట్టి తెలుగుగడ్డకు బంగారపు పూతను పూశాయి. ఉన్నిలో దాగిన గొర్రెపిల్లలలె తెలుగుగడ్డ మొత్తమూ చలిమంటలమధ్య వెచ్చదనం కోసకు నిలబడింది—ఒక్క బోరుపాలెం తప్ప!

డాక్టరు నరసింహారావూ, కరణం వెంకటాచలపతీ కుటుంబా లకు మాత్రమే పరిమితమైవున్న రాగద్వేషాలూ, పొగలూ సెగలూ, ఇప్పుడు మరొక యింటివరకూ పొడిగింపబడ్డాయి. ఎవరితోనూ వైరమెరుగని, అజాత శత్రువని పేరొందిన రామసుబ్బయ్య నేడు పంచాగ్ని మధ్యంలో జీవిస్తున్నాడు.

నరసింహారావు, తనను రామసుబ్బయ్య కావాలని ఇలా అవమా నించినట్లు భావించాడు. "ఇది నా స్వంత వ్యవహారం. పెళ్ళి చేసుకోవ డానికి, వద్దనడానికీ నా కుటుంబానికి మాత్రమే అధికారముంది. వెర్రి కొడుకును పెళ్ళిపీటలపై కెక్కించి విందు పందిరిలో నన్ను అవమా నిస్తాడా?" అని బహిరంగంగానే అన్నాడు- నరసింహారావు పేరుకు తగ్గట్లు వ్యవహరిస్తూ.

కరుణాకరం మాత్రం పేరుకుతగ్గట్లు కాకుండా ప్రవర్తించాడు. ఆయన కోపం మొత్తం వెంకటాచలపతి నుండి మధుమూర్తి మీదికే తిరిగింది. తన పెండ్లిలో మధుమూర్తి జోక్యం!తన నుదిట భాషికం!! కాని, పుస్తె కట్టింది మధుమూర్తి! ఎంత అవమానం! ఎంత ఘోరం!!

అది భరించలేక పొగలూ సెగలూ కక్కాడు. నోటికొచ్చి నట్లల్లా తిట్టాడు.

ఒకనాడు ఇద్దరూ అకస్మాత్తుగా కరకట్టకవతల కలుసు కున్నారు. మధుమూర్తి నదీ ప్రవాహంలో తళతళ మెరిసే చేపలనూ వాటికై శరవేగంతో వచ్చే జలపక్షులనూ తిలకిస్తున్నాడు. 'ఈ సృష్టి హింసోన్మత్తమైనది. పెద్దచేప కూడా చివరకు చిన్నచేపను తిని జీవిస్తున్నది' అనుకున్నాడు. మరి నాలుగు అడుగులు వేసేలోగా కరుణాకరం!

మధుమూర్తే కరుణాకరాన్ని ఆప్యాయంగా పలకరించాడు. ఆ పలకరింపు జరిపినప్పుడు మధు, పెండ్లినాటి ముచ్చటను గత జన్మ స్మృతివలెనే మరచిపోయాడు.

కాని కరుణాకరం అన్న మొదటిమాట- "డాన్‌క్విక్సోట్!"

"అంటే?" అమాయకంగా ప్రశ్నించాడు మధు.

"అంటే నీవు వెర్రివెంగళప్పవని అర్థం."

"కరుణా!" ఊహించని యీ ఆకస్మిక నిందకు చలించిపోయాడు మధు. అతని రసాత్మ క్షుభితమైంది.

కరుణాకరమే మొదలుపెట్టాడు- 'నీవు మనిషివేనా? ఎవడినడిగి పెళ్ళిపీటలమీద కూర్చున్నావురా?"

వ్యవహారం శ్రుతిమించినప్పటికీ మధుమూర్తి నిగ్రహించుకున్నాడు. సంస్కారం ఆవేశాన్ని కళ్ళెంవేసి ఆపింది.

"ఏం కూర్చుంటే?" మృధువుగానే ప్రశ్నించాడు.

"నీకేం హక్కువుంది - నా పెండ్లిలో జోక్యం కల్గించుకునేందుకు?"

"పెండ్లి జరగనిదే, అది నీపెళ్ళి ఎలా అవుతుంది?"

కరుణాకరం రెచ్చిపోయాడు. డాక్టరు కళ్ళకు మధు కప్పవలెనో బొద్దింకవలెనో కన్పడ్డాడు.

"పెళ్ళి చేసుకోవడానికీ వద్దనడానికీ కూడా నాకు మాత్రమే అధికారం వుంది."

"మంచిది! లోకంలో కన్నీళ్ళ సెలయేళ్ళ మధ్య మునిగే ఎవరినైనా సరే ఆదుకోవడానికి నాకూ అధికారం వుంది."

"ఇలా ఎందర్ని ఆదుకుంటావురా? ఎన్ని పీటలమీద కూర్చుంటావు?"

"కరుణా! మర్యాద తప్పి మాట్లాడుతున్నావు."

"మర్యాద అనే మాటకు అర్థం తెలుసునురా, నీకు?"

మధుమూర్తి ఇక సహించలేకపోయాడు. తాను ఎంత గౌరవం ఇస్తున్నాడో కరుణ అంత అసభ్యంగా ప్రవర్తిస్తున్నాడు- పైగా తన్ను 'రా' అంటూ.

"కరుణా! ఇదిగో చెపుతున్నా విను-నేను చేసిన పని తప్పో ఒప్పో నీ నోటికి తెలియకపోయినా ఆత్మకు తెలుసు. నీవు మూర్ఖుడివనీ కృష్ణలంకలోకూలీలవలెవ్యవహరిస్తావనీ నేను భావించడంలేదు. బస్తీలో చదివిన విద్యకు ఫలితం సంస్కారం! కాని అది మాత్రమే నీలో

లోపించినట్లు కనబడుతున్నది. పెళ్ళిపీటలమీద ఒక సంసారాన్ని బెదిరించి. అసు ా జేద్దామని నీవూ మీనాన్నా కలిసి పన్నిన కుట్రను ఆత్మప్రేరణతో నేను భగ్నంచేశాను. అందుకూ నీకింత కసి. బేరం కుదరని జామపండును వదిలేసి లేచిపోయినట్లు పీటలపై నుండి తండ్రివెంట లేచిపోయిన నీకిక ఆ పెళ్ళిపందిటితో సంబంధమేముంది? 'నాకా సంబంధం వద్దంటూ' ఇంకా నా 'పెండ్లి' అంటావేం?

"కరుణా! లోకం ఎవరినైనా సరే కాపాడేందుకే మనకు హక్కు వుంది. కాని బాధించేందుకులేదు. నీవు చేసుకోవు—ఆ కుటుంబం ఆ అవమానంతో కృష్ణలో దూకితే చూస్తూ వినోదం చిత్తగిస్తాను, నీవూ మీ నాన్నా. కాని, అనుకునేందుకెవడైనా వస్తేమటుకు కోపమా? దీని పేరేనా, మానవత్వ మంటారు? వైద్యవిద్య నీలో హృదయం పెంచుతుందనుకున్నానుకాని, పశుత్వం నింపుతుందనుకోలేదు. పశువుల డాక్టర్లు కూడా ఎంతో దయతో వుంటారే-మరి మనుషుల డాక్టరివి నీవు పశువుగా మారావేం కరుణా?"

ఆవేశంలో ఒళ్ళు తెలియని కరుణాకరం పెడీ పెడీమని కొట్టాడు మధుమూర్తి పైబడి.

అనుకోని ఈ ఆకస్మికమైన దాడికి మధుమూర్తి కృష్ణఇసుకలో పడ్డాడు. "రక్తం తాగుతాను- జాగ్రత్త!" అంటూ చేతులు దులుపుకొని రెండడుగులు వేశాడు కరుణ.

అంతే! మధు ఇసుకలోనుండి లేచి నిలబడ్డాడు. వెనుకనుండి ఒకే గుద్దుతో కరుణాకరాన్ని నేలకూల్చాడు.

"అమ్మో!" అని కరుణ పెట్టిన కేక దూరపు లంకలకుకూడా విన్పించింది.

బిలబిలమంటూ జనంమూగేసరికల్లా, దుశ్శాసనుని గుండెలపై భీమునివలె కూర్చొని వున్నాడు మధు.

"నీవు అన్నావుకాని, నేను చేసే చూపిస్తాను" అంటూ ముక్కుపై గుద్దాడు. ముక్కునుండి రక్తం వచ్చింది. చుట్టూ జనం హాహాకారాలు! మరుక్షణంలోనే ఇద్దరినీ విడదీశారు.

మధు- డాక్టరుగార్ని కొట్టాడనీ, నెత్తురు వరదలై పారి కృష్ణలో కలపిందనీ వార్త ఊళ్లో క్షణాలమీద వ్యాపించింది.

ఈ పుకారు పరిమిదాకా వెళ్ళేసరికి కృష్ణానది మొత్తం ఇవ్వాళ ఎర్రగానే దోరుపాలెంనుండి ప్రవహిస్తున్నదని చెప్పుకొన్నారు.

ఈ సంఘటనతో మధుపై ఎవరికీ సదభిప్రాయం లేకుండా పోయింది. 'పద్దవారెపుడూ చెడ్డవారు కారనే' సామెత నిజంకాలేదు.

ఊళ్లో అందరి అభిమానమూ, సానుభూతీ రెండూ కోల్పోయాడు మధు. దానితో దినదినమూ ఏవో కొత్త సమస్యలు మధు-మూర్తి కుటుంబంలో రాసాగాయి.

ఆ నాడు ఉదయం శ్యామల అన్నది-"అమ్మా! వెళ్ళి వదినను చూచి వద్దామే" అని.

పేరుకు కళ్యాణమైతే జరిగిందికాని, ముద్దూ ముచ్చటలూ ఏవీ నోచుకోలెదు మధుమూర్తి. జరగవలసిన లాంఛనాలుకూడా జరగలేదు. మధుమూర్తి ఇవేవీ పట్టించుకోలేదు కాని, మహాలక్ష్మమ్మ, శ్యామలలు కొంచెం బాధ పడ్డారు. అందుకే శ్యామల కోరికను హృదయపూర్వకంగా అంగీకరించలేక పోయింది మహాలక్ష్మమ్మగారు.

అయినా పెందలాడే వంట ముగించి శ్యామలను తీసుకొని వెంకటా చలపతిగారింటికి వెళ్ళింది. చలపతిగారి భార్య వరమ్మా, సోదరి రంగమ్మా ఏదో చర్చిస్తూ వీరిని చూడగానే ఆగిపోయారు.

చిరునవ్వుతో ఇర్వురూ లోనికి ప్రవేశించగానే, రంగమ్మ పని చేస్తున్న పిల్లతో చాప పరచమని పెద్దగా లోనికి కేకపెట్టింది.

"మనలో మనకు చాపలెందు"కని మహాలక్ష్మమ్మగారు వెళ్ళి వాళ్ళ సరసన రాతినేలపైనే కూర్చున్నది.

అదేమిటని గట్టిగా వరమ్మ వారించలేదు. కలుక్కు-మన్నది మహాలక్ష్మమ్మగారి మనస్సు.

మహాలక్ష్మమ్మే సంభాషణ- పిచ్చాపాటీ ప్రారంభించింది. వరమ్మ వింటున్నదేకాని, అవునసీ కాదనీ సంభాషణలో జోక్యం కల్గించుకోలేదు.

"ఏమిటా శబ్దం దొడ్లో?" అంటూ ఏదో వంకతో రంగమ్మగారు లేచి, "ఏమీ అనుకోకండమ్మా!" అంటూ వెళ్ళిపోయింది.

ఇక మిగిలింది వరమ్మ-తామూ. శిలాప్రతిమలా ఆమె, చిలక పిట్టల్లా తామూ. ఎంతసేపు సాగుతుందీ సంభాషణ.

కొన్ని క్షణాల తర్వాత శ్యామల, "ఏం చేస్తున్నది వదిన?" అంటూ చొరవ తీసుకొని ఇంట్లోకి వెళ్ళబోయింది.

"లేదమ్మా! ఒంట్లో బాగోలేకపోతే గార్లపాడు పంపాము."

గార్లపాడు వరమ్మగారి పుట్టిల్లు. మహాలక్ష్మమ్మ కాళ్ళు చల్లబడ్డాయి. ఆ తర్వాత వాళ్ళు ఎక్కువసేపు కూర్చోలేకపోయారు.

"వస్తానమ్మా!" అన్నది మహాలక్ష్మమ్మగారు.

"మంచిది!" వరమ్మగారి సమాధానం.

లాంఛనంగా ఇరువురి ముఖానా కుంకుమ పెట్టి పంపింది.

శ్యామలకూడా పరిస్థితినంతా పూర్తిగా అర్థం చేసుకున్నది. మహాలక్ష్మమ్మ నిగ్రహించుకున్నది కాని, శ్యామలకు వీధిలోకి రాగానే దుఃఖం ఆగలేదు.

"మనమేం చేశామని ఇలా అవమానించారు వాళ్ళు?" అన్నది భోరున ఏడుస్తూ శ్యామల.

మహాలక్ష్మమ్మగారు ఇంద్రియాలను స్వాధీనం చేసుకునే ప్రయత్నంలో ప్రతి సమాధానం చెప్పలేదు.

కన్నీళ్ళతో శ్యామలే అన్నది—"మనం చేసిన ఉపకారానికి ఇదా ప్రతిఫలం? చెప్పమ్మా-ఇలాగేనా వియ్యపురాలిని లోకంలో అంతా గౌరవించే పద్ధతి? డాక్టరుగారి కుటుంబానికీ వీళ్ళకీ తేడా ఏమిటిప్పుడు?"

మహాలక్ష్మమ్మ మౌనం.

"వదిన గార్లపాడు వెళ్తున్నదని మాటమాత్రం కూడా తెలియదే! మొన్న తెల్లవారుజామున మువ్వలూ, గంటలూ మ్రోగాయి. బహుశా అప్పుడు బండిలో పంపివుంటారు. ఆ క్రితంరోజే అన్నయ్యా, కరుణా దెబ్బలాడుకున్నారు." శ్యామల తల్లివద్దనుండి ప్రతిసమాధానం అర్థించకుండానే అన్నది.

కాసేపయిన తర్వాత శ్యామలే అన్నది—"అన్నయ్య ఎంత పనిచేశాడమ్మా! బ్రతుకు దుర్భరమయిపోయే సాహసం చేశాడు అవివేకంతో."

ఈ మాటతో మహాలక్ష్మమ్మ లోపల మరుగుతున్న పీటిబుగ్గ ఇక ఆగలేదు. కళ్ళవెంట అది బహిర్గమించింది— కృష్ణకు ఉపనదిలా.

"అన్నయ్య చెపిన సాహసమంటే—పెళ్ళా? కరుణాకరంతో దెబ్బలాటా? ఏది నీ ఉద్దేశం?" అని మహాలక్ష్మమ్మగారు అడగలేదు. ఆవిడ కంఠం గాద్గదికమై; వీధిలో పరువు దాచుకొనేందుకు మాత్రమే నడకను నటించి యిల్లుచేరి, ఒంటరిగా ఒక గదిలోకి వెళ్ళిపోయింది.

రామసుబ్బయ్యకీ సంగతి తెలిసింది. ఎందుకు వెళ్ళారని చీవాట్లు పెట్టలేదు. ఏమీ ఇలాఅయిందని విచారించలేదు. నిర్లిప్తంగా మిగిలిపోయాడు. అదే ఇంకా బాధించింది మహాలక్ష్మమ్మగార్ని. ఆయన నాలుగు తిట్లు తిట్టినా గుండెబరువు తగ్గేది వారికి. ఈ మౌనం ఆమె హృదయాన్ని ఛేదించింది.

అందుకే రాత్రి భర్త పూజ ముగించుకొన్నాక ఫలహారం వడ్డించి తలుపుదగ్గరగా నిలబడి తానే సంభాషణకుపక్రమించింది.

"జరిగింది విన్నారా?" దేనిని గూర్చి అన్నదో మరి?

"ఆఁ." ఏది విన్నానని చెపుతున్నాడు?

మళ్ళా నిశ్శబ్దం.

"మనవాడు చాలా భయంకరమైన పొరపాటు చేశాడు." తల్లి అన్నది.

తండ్రి మౌనం.

"నాకెందుకో భయంగా వుంది.ఎలాఈకాపురం కుదుటపడటం?"

రామసుబ్బయ్య నవ్వి అన్నాడు-"ఇంకా మాధవుడు సంసారం చేయబోతున్నాడనేనా నీ ఉద్దేశం?"

మహాలక్ష్మమ్మగారీ అమంగళాన్ని సహించలేకపోయింది. ఏదో మాట్లాడుదామని నోరు విప్పింది. కాని నిశ్శబ్దం ఆమె సంభాషణను జయించింది.

భర్తే అన్నాడు-"ఇప్పుడు జరిగిన దానిలో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఇలా జరగకుండా వుంటేనే ఆశ్చర్యపడాలి! చలపతికి మన మీద అంత సదభిప్రాయం లేదు. పైగా తన అల్లుడు ఏ డాక్టరోనని ఘనంగా చెప్పుకోవాలనీ, బస్తీలలో కార్ల మీద తిరగాలనీ ఆయన కోరిక. అలాంటిది జరగకుండా నరసింహారావు చేశాడు. పొలం విషయంలో చలపతి మాటే నిజం కావచ్చు. నరసింహారావే అన్యాయానికి దిగి వుండవచ్చు. అయినా ఆయనకు నరసింహారావే

కావాలి. కరుణనే అల్లుడిగా చెప్పుకోవాలి. అదీ వాళ్ళ కోరిక." కొంచెం ఆగి ఫలహారపు ఉప్పుడు పిండిలో మజ్జిగ పోయగా ఇలా అన్నాడు—

"కాని వాళ్ళ కల కల్ల అయింది- యథార్థమని భావించిన విషయం పీటల మీది నుండి ఎగిరిపోయి, ఊహాగానంగా మిగిలి పోయింది. మాధవుడు అత్యవసర సమయంలో వాళ్ళ పరువును నిలిపి పెళ్ళి పందిటిలో తల ఎత్తుకునేటట్లు చేయగలిగాడే కాని, వాళ్ళ గుండె నిండుగా 'అల్లుడ'ని, గర్వంగా చెప్పుకునే రూపాన్ని సృష్టించు కోలేక పోయాడు. అదీ సంగతి. అందుకే ఈ అవస్థ అంతా."

"మరి ఈ త్యాగం ఎవరి కోసం చేసినట్లు?" మహాలక్ష్మమ్మ అవ్యక్తంగా అన్నది.

"అది నీ కొడుకునే అడుగు." పిండి మజ్జిగ తినకుండా అందులోనే చేయి కడుక్కొని లేచాడు.

మహాలక్ష్మమ్మ కళ్ళల్లో నదిలోని సుడులు. ఆ రాత్రి ఆమెకు శివరాత్రి అయింది. ఆమె గుండె బ్రద్దలయిపోయింది. ఏమి కానున్నదో ఇంక మీద.

'ఏమిటీ పరీక్ష? ఇంత జరిగినా, భర్త చూస్తూ ఊరుకున్నా డేమి? హాయిగా పడుకుంటున్నాడేమి?' ఇలా ఆలోచించసాగింది.

ఆమెకు తెలియదు-రామసుబ్బయ్యగారికి ప్రతిరోజూ ఏకాదశే నని.

ఇలా వుండగా మరొక వైపు నుంచీ కొత్త ఒత్తిడి ఒకటి వచ్చింది. వెంకన్న చెప్పాడు- రామసుబ్బయ్యగారితో, డాక్టరుగారి పాలేర్లు కయ్యానికి కాలు దువ్వుతున్నారని.

"నిన్న రాత్రి లంకలో జరిగిన దొంగతనం ఎవరు చేయించారో నాకు తెలుసు. లేత పుచ్చకాయ మొక్కలను పీకేశారు. దోసపంట మరో రెండు రోజుల్లో బండి కెత్తుదామనుకుంటున్నాను. ఇంతలోనే ఇట్లా అయింది. అదీ చాలా నాశనమయింది."

రామసుబ్బయ్యగారు విర్లిప్తంగా విన్నారు.

"చూస్తూ వూరుకొంటే ఇక లాభం లేదు బాబుగారూ! అటో ఇటో తేలాలిసిందే. మీరు 'ఊఁ' అనండి చాలు. ఏవిటి వీళ్ళ

బోడి గొప్ప-డాకమేరయితే ఎవడికి గొప్ప? బోడి డాకమేరు! అస లీయన మంది స్తేనే మా పిన్నమ్మకూతురు చచ్చింది."

అజాత శత్రువైన రామసుబ్బయ్య చుట్టూ ఆపద వలయాలు. చీమకు అపకారంచేసి ఎరుగని పెద్దమనిషి చుట్టూ సమస్యల సర్ప పరిష్వంగాలు. 'విధివంచితుడా తాను?' నవ్వుకొన్నాడు.

"ఇంత జరిగితే నవ్వుతారేంది బాబుగోరూ!" చేతిలో కర్రను నేలపై గుద్ది అన్నాడు కోపంగా వెంకన్న.

"ఈ నవ్వు అర్థం వేరురా."

"ఓహో! ఆ అర్థమే అయితే సూడండి- రాత్రికి రాత్రే సఫా."

వెంకన్న కోపం క్రుతిమించుతున్నది. రామసుబ్బయ్య శాంత పరిచాడు వెంకణ్ణి.

కాని చూస్తూండగానే, ఎవరో మోశారీవార్తను నరసింహా రావుగారింటికి___ 'రామసుబ్బయ్య ప్రతీకారంతో బుసలు కొడు తున్నాడు. వెంకడు ప్రతిజ్ఞ కూడా పట్టాడు- శత్రువులను రాత్రికి రాత్రే 'సఫా' చేస్తానన్నాడని'. దానితో మాటలు మంటలనెలా వర్షి స్తాయో బోరుపాలెంలో కన్పడింది.

తెల్లవారేసరికే వెంకడి గుడిసె తగలబడ్డది. దెబ్బలు తిన్న వెంకడు వచ్చాడు.

"బాబుగారూ! సూడండి-నా గతి. ఏం చేస్తానో సూడండి వీళ్ళని."

'వద్దు' అని కాని 'అలాగే' అని కాని అనే అర్హత తన కిప్పుడులేనట్లు భావించాడు రామసుబ్బయ్య. వ్యవహారం మితిమీరింది. ఇప్పుడీ విషయం వెంకడి వరకూ పాకింది. ఈ విషవలయంలో మరి కొన్ని కుటుంబా కూడా చిక్కుకుంటున్నాయి.

'ఏమిటి? దీని పరిష్కారం ఏమిటి??'

ఆ రోజు ఆలస్యంగా ఇంటికి వచ్చాడు మధుమూర్తి. అప్పటి వరకూ నదిఒడ్డున పడమరగా చాలా దూరం నడిచిపోయాడు. హరి శ్చంద్రపురం వంటి చిన్న చిన్న ఊళ్ళు వచ్చాయి. ఆగకుండా అలాగే నడిచి వెళ్ళాడు.

'పల్లెటూరి ప్రకృతిని అంతా తెగపొగుడుతారే! ఇదేనా పల్లెటూరు? ఇలా వుందేమిటి- ఈ ప్రకృతి? నవ ప్రకృతి? మానవ ప్రకృతి? అంతా ఇంతేనా లేక....?' మధుమూర్తి మెడకు చుట్టుకొన్న టవల్‌ను చెవుల పైకి లాగాడు. అయినా రివ్వున చలిగాలి!

జలజలమనే నల్లని కృష్ణ- చీకట్లో ఇంకా నల్లగా వుంది. రెండువైపులా తోటలు— దూరాన విజయవాడ విద్యుద్దీపాలు, రివ్వున, ఉన్నట్టుండి శబ్దం చేసుకొంటూపోతున్న స్టీంలాంచి.

'బోరుపాలెం అందమైంది కాదా? నిజానికి ప్రకృతి ప్రసాదించిన వరం ఈ చిన్న ఊరు. అసలీ నదీ తీరాన ఊరు వుండటమే అదృష్టం కాదా?

ఇక్కడ కోకిలలకు కాలపు నిబంధనలు లేవు. శారికలకూ కీరాలకలరుతాలకూ చీకటివెలుగులులేవు. పండిరాలిన జామపండ్లను జలపక్షులు ఒడ్డుకుపచ్చి ఏరుకుంటుంటాయి ఎల్లవేళలా

పామో, చేపోకూడా తెలియని మూరెడు పొడుగు జలచరం మెడ నిక్కించి మానవుణ్ణి పలకరిస్తుందిక్కడ. మూరెడు తెప్ప కొయ్యతో చేపలతో పోటీపడి కాపు పిల్లలు అవతలి వడ్డుకు పాకుతూ పోతారు నీళ్ళలో.

మత్స్యకన్యలవలెనూ. నాగయుగరాజులవలెనూ, నిరంతరం నవ్వే ఈ ప్రకృతి — ప్రవహించే ప్రకృతి— పొంగి పొర్లుతూండే ప్రకృతి— పూల ముఖాలతో కొమ్మల చేతులతో ఊగుతూ, ఊపుతూ పలకరించే ఈ ప్రకృతి....

ఇక్కడ తన జన్మం కాకతాళీయమా? ఈశ్వరుని నియమబద్ధ ప్రణాళికలో ఒక భాగమా? తానిక్కడకాకుండా మరెక్కడో-ఏ పొగ గొట్టపు ధ్వనులమధ్యనో పుడితే ఏమై వుండేవి? అప్పుడు....అప్పుడు ఈ మధుమూర్తి లోకానికి మిగిలేవాడా?' నవ్వుకున్నాడు మధుమూర్తి.

'అయినా ఈ మధు ఇప్పుడెవరికి కావాలి? తన భావాలూ, ఊహలూ ఎవరికి కావాలి? తాను డాన్‌క్విక్‌సోట్‌ట. ఓహో! ఏమి అపురూప కల్పన? ఏమి అందమైన వ్యాఖ్యానం? ఎంత గౌరవం ఈ పూళ్ళో కవికి? వీళ్ళకు డబ్బులుముద్రించే యంత్రాలలాంటి మనుషులు కావాలి—కార్లు కావాలి. కమనీయ భావనా సౌధాలు, సౌరభాలు వద్దు!

చీకట్లో కాలికేదో తగిలింది. జరజర పాకుతున్న సూచన-పాము కాదుకదా? కావచ్చు—కాకపోవచ్చు!'

ఠక్కున వాస్తవ లోకంలోకి వచ్చాడు మధు. బోరుపాలెం వదిలి చాలా దూరం నడిచాడు తాను. ఇలాగే మరోగంట నడిస్తే అమరేశ్వరుడు.

దానితో వెను తిరిగాడు. వాలుగా కృష్ణవలెనే సాగుతున్న మధు భావధార! ఇంటికి వచ్చేసరికి బాగా పొద్దుపోయింది.

ఇంటివద్ద మహాలక్ష్మమ్మ భయపడుతున్నది. శ్యామల పెంద లాడే అన్నం తినేది, అసలు తిండిమాటే మరచిపోయింది. 'ఊళ్లో ఈ హడావుడి, అన్నయ్య ఇంకా ఇంటికిరాలేదు- ఎందువల్ల?'

రామసుబ్బయ్యగారు ఎవరితోనో లేని పని కల్పించుకొని మాట్లాడుతున్నాడేకాని మనసు మనసులోలేదు. చీకటి ఇంకా దట్టంగా కానుగుచెట్ల నీడలవలె వ్యాపిస్తున్నది.

అప్పుడు వచ్చాడు మధు!

మాధవుణ్ణి చూడగానే చీకటిలోకూడా సుబ్బయ్యగారి కండ్లు మెరిశాయి. మాట్లాడుతున్న కూలీలు వెళ్ళిపోయారు.

అంతా అన్నాలకు కూర్చున్నారు. తండ్రి కొడుకునేమీ ప్రశ్నించలేదు. కొడుకు తండ్రివైపు చూడలేదు.

వేడి వేడి పప్పుచారు గరిటెతో వడ్డిస్తూ తల్లి అన్నది- "అర్థ రాత్రిదాకా ఏమి తిరుగుళ్ళురా నీవి?"

మధు బదులు పలకలేదు.

"ఎక్కడికిపోతాయీ కృష్ణా, తోటలూను?"

మధు నవ్వాడు. "అవెక్కడికీ పోవమ్మా! మనమే ఎక్కడి కన్నా పోవచ్చు కదా? ఏది జరిగినా ఫలితం ఒకటే!"

రామసుబ్బయ్య ఒక్కసారి ఆశ్చర్యంగా తలెత్తి చూశాడు. ఆయన కనుబొమ్మలు విచిత్రంగా కదిలాయి. ఏదో తళుక్కుమని ఆయన కన్నులలో ఒక కాంతి.

భోజనాలు ముగిశాక లోపలేవేసిన పక్కలపై మేనువాల్చారు శ్యామలా, మధులు.

రామసుబ్బయ్యగారు మాత్రం అటూ ఇటూ ఇంట్లోనే పచార్లు

చేస్తున్నారు ఏదో నామస్మరణ చేస్తూ. మహలక్ష్మమ్మగారు ఒక్కతే భోంచేస్తున్నది లోపల.

రామసుబ్బయ్యగారు అకస్మాత్తుగా అన్నారు- "మాధవుడూ!"

"ఊఁ."

"వెంకడి సంగతి చూచావుకదా?"

"ఊఁ."

"నీ ఉద్దేశం ఏమిటి?"

మధు మాట్లాడలేదు. తండ్రిగారు ఏదో చాలా తీవ్రమైన విషయాన్నే తనతో చర్చించబోతున్నాడని మాత్రం గుర్తించాడు.

లేచి కూర్చున్నాడు. లాంతరు కొంచెం పెద్దదిచేసి పచ్చి పోకలూ, యాలకులూ, లవంగాలూ వున్న పెట్టెను దగ్గరికి లాక్కొని, తండ్రి చెప్పబోయేది వినడానికి సిద్ధంగా కూర్చున్నాడు.

రామసుబ్బయ్యగారు చిన్నగా దగ్గి, గొంతు సవరించుకొని అన్నాడు-"నీవు ఇందాక భోజనం ముందు చెప్పింది చాలా నిజం!"

మధుమూర్తి ఆశ్చర్యంగా చూచాడు!

"అవున్రా! కృష్ణ ఎక్కడికీ పోదు-కాని మనమే కృష్ణను వదిలిపోవాలేమో!"

మధుమూర్తిలో అయోమయం!

"నేను చూస్తే పెద్దవాడినైనాను. నీవా వయస్సు పెరిగినా, ఇంటి బాధ్యతలు నెత్తిని వేసుకోకుండా లంకను పట్టుకు తిరుగుతున్నావు. చెల్లెలి పెండ్లిచేయాలి. సంబంధంకోసం చూస్తుండగానే అకస్మాత్తుగా నీ పెండ్లి జరిగిపోయింది." రామసుబ్బయ్యగారు కొంచెం ఆగారు.

మధుమూర్తి ఊపిరి బిగపట్టాడు.

"నీ పెండ్లిచేసి, ఏదో కాస్త మిగిలితే దానితో చెల్లెలి పెండ్లి అప్పును తీర్చాలని నా భావం లోగడ. కానీ ఇప్పుడు పరిస్థితులు మారాయి. నీవు హేమలతకు మొగుడివే కాని, వెంకటాచలపతికి అల్లుడివికావు."

"అంటే?" మధు ప్రశ్నించాడు.

"నిన్ను కరుణను చూచిన దృష్టితో ఆయన చూడటంలేదు.

కాబట్టి మనం అటునుండి ఏమీ ఆశించలేము. కేవలం నీవొక త్యాగాన్ని అనాలోచితంగా చేశావు. కాని దానిని విలువకట్టే వాళ్ళు లేకపోవడంవల్ల- దానిని ఎవరు పొందారో వాళ్ళుకూడా నిన్ను ద్వేషిస్తున్నారు."

మధుమూర్తి తల తిరుగుతున్నది. అతనికిప్పుడు గేయాలూ, గీతాలూ, కృష్ణలంకలూ కన్పడటంలేదు. రోజూ పడుకోబోయేముందు కన్పడే ప్రబంధ సుందరుల స్నానాగారాలూ, పంపా విరూపాక్షుని ముందు విన్పడ్డ సాహిత్య విపంచికలూ ఇప్పుడు స్మృతికి రావడం లేదు. తండ్రి కేవలం తన్ను ద్వేషిస్తున్నాడనీ, తన ఔదార్యం అర్థం చేసుకోవడం లేదనీ మాత్రమే ఇంతవరకూ అనుకుంటున్నాడు కానీ, ఇంత నీతంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకుంటున్నాడని ఇప్పుడే గమనించాడు.

వాస్తవలోకంలోకి దిగి తండ్రి మాటలను వింటున్నాడు జాగ్రత్తగా.

రామసుబ్బయ్యగారు నిశ్వసించి ఇలా అన్నారు. "దానికితోడు నరసింహం మనమీద పగబట్టాడు. తన కుటుంబ వ్యవహారాలలో మనం జోక్యం కల్గించుకున్నామని ఆయన కోపం. ఉపకారమో, అపకారమో- ఏది చేసినా తానే చేయాలి కాని, ఇందులో ఇతరుల బాధ్యత లేదని ఆయన భావం. ఒకరకంగా అది నిజం కూడాను."

"అంటే హేమలతను అవమానం నుండి నేను కాపాడటం తప్పంటారా నాన్నా?" మధు ప్రశ్నించాడు.

"నీ దృష్టిలో తప్పు కాకపోవచ్చు. నీతి దృష్టిలో తప్పు కాకపోవచ్చు - కాని ఊళ్ళోవాళ్ళు దానిని తప్పనే అంటున్నారు. ఎవ్వరూ చేయని ఈ పనిని నీవు చేసినందుకు నిన్ను నిందిస్తున్నారు."

"ఇతరుల నిందాస్తుతులకోసం నేనాపని చేయలేదు-నా ఆత్మ సంతృప్తికోసం చేశాను."

"మంచిదే! కథల్లో సినిమాల్లో ఈ 'ఆత్మ సంతృప్తి' 'ఆదర్శం' వంటి మాటలు బాగుంటాయి కాని, ఇప్పుడు జీవితం మాటేమిటి? హేమలతను అసలు వాళ్ళు కాపురానికైనా పంపిస్తారంటావా?"

మధు త్రుళ్ళిపడ్డాడు. కించ త్తప్పతా విమూఢుడై నాడు. విషయం ఆలోచించినకొద్దీ తీవ్రమౌతున్నది. ఆవేశంలో తాను చేసిన పని ఎంత కథకు దారితీసింది? తన ముగ్ధభావోద్వేగం సమాజంలో సమస్యల తోరణమై నిలిచింది!

అంతేకాదు- ఈ పరిస్థితులు చూస్తుంటే మన మీవూళ్ళో సుఖంగా బ్రతికి బట్టకడుతామని కూడా అనిపించడంలేదు. పెద్దవాళ్ళతో వైరాలు, పగలు,ద్వేషాలూ! నేనూ ప్రతీకారానికి దిగుదును. కానీ ప్రయోజన మేమిటి? నిప్పు నీళ్ళవల్ల ఆరుతుందేకాని, మరికొన్ని చితుకులను ఎగత్రోయడంవల్ల కాదు."

"అయితే ఏంచేద్దామో చెప్పండి?" మధు పశ్నించాడు— ఆందోళన కన్పడనీయకుండా.

"ఏమీలేదు. మనం బస్తీ చేరడం శ్రేష్ఠమని నా ఉద్దేశం. జామతోటను కౌలుకిస్తాను. పుచ్చపాదులు వెంకడి స్వాధీనం చేస్తాను. పట్నంలో ఇర్వురం కలిసి సంపాదిస్తే సంసారం కూడా కొంత కుదుటపడవచ్చు."

మధుమూర్తి నివ్వెరపోయాడు! తాను ఆలోచించకుండా అన్న మాట ఇంత నిజమయిందేమిటి? తానెక్కడ- పట్నవాసపు జీవిత మెక్కడ? ఎలా సాధ్యమిది? సహజ ప్రకృతికి దూరంగా-ఆవును వదిలిన లేగవలె—తల్లి నుండి దూరమైన పాపనివలె- బోరుపాలెం వదిలి తాను?

మధుమూర్తి ఆలోచించలేకపోయాడు. తల బరువెక్కింది— వేడెక్కింది.

"కొంచెం ఆలోచించనీయండి నాన్నా!"

"ఆలోచనే జీవితమైన నీవు కొంచెమేమిటి - తీరుబడిగానే ఆలోచించు, ఇవ్వాళే ఏమీ ముంచుకొని పోలేదు." రామసుబ్బయ్య గారు మేను వాలుస్తూ అన్నారు.

కాని ఆరోజే ముంచుకొని వచ్చిందని ఆయనకేం తెలుసు? నిద్ర పట్టక అలాగే ఆలోచిస్తూ పడుకున్న మధుమూర్తికి రాత్రి ఒంటిగంటకు ఏదో అలికిడి విన్పించింది. గుండె తీవ్రంగా పనిచేసింది. కర్ర, లాంతరు తీసుకొని బయటకు వచ్చి చూచాడు. చీకట్లో—

గాడాంధకారంలో - కొన్ని కొరివిదయ్యాలు గాలిలో నక్కినక్కి గెంతుతున్నాయి.

"నాన్నా!" గుండెలదిరేటట్లు, పకృతి బద్దలయ్యేటట్లు మధు కేకవేశాడు. దయ్యాలు చెట్లచాటుకు పారిపోయాయి.

రామసుబ్బయ్య భయింగా వాకిట్లోకి వచ్చి చూచాడు. చుట్టుపక్కలవాళ్ళు కూడా లేచారు. అంతా కొన్ని నిమిషాల గందరగోళం. భయం కారుచీకటిలా చుట్టూ ప్రవహిస్తున్నది. దీనికి కీచురాళ్ళ మద్దెలలు, గోదురకప్పల సన్నాయి. అందరికీ విషయం తెలిపిపోయింది క్షణాల్లో.

అయితే ఎవరూ మారు పలకలేదు. అవి ఎవరు పంపిన దయ్యాలో అందరికీ తెలిసిపోయింది. ఎవరికివారికే భయం-లేదా స్వార్థం. ఎవరి ఇళ్ళల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు. నిట్టూర్చి రామసుబ్బయ్య లోనికి చేరాడు.

ఏడుస్తూ, "ఏడుకొండలవాడా!" అని మొక్కుకొంటున్నది మహాలక్ష్మమ్మగారు.

'గృహదహనం! ఇంత అన్యాయమా!' తెల్లని మధు కళ్ళు ఎఱ్ఱ కలువలవలె మెరిశాయి.

'పారిపోవడం దేనికీ పరిష్కారం కాదు-దెబ్బకు దెబ్బే' అనుకున్నాడు కోపంతో.

బాధగా, అనుభవంతో కూడిన నిట్టూర్పును వదిలి, నుదుట చేయి చేర్చాడు రామసుబ్బయ్య.

ఆ తెల్లవార్లూ వారికి జాగారమే!

మరునాడు ఉదయం నుండీ రామసుబ్బయ్య ప్రయాణ సన్నాహాలు ప్రారంభించాడు. కొందరు జాలిపడ్డారు, కొందరు బాధపడ్డారు, కొందరి వెక్కిరింతలు, కొందరికి సంతృప్తి!

మధుమూర్తి తల్లినడిగాడు-"అమ్మా! మరి హేమలత మాట?"

ఆమె భర్తనడిగింది. ఆయన ఔననీ, కాదనీ కూడా చెప్పలేదు. ఆమె మళ్ళీ రెట్టించి అడిగింది.

ఆయన అన్నాడు—"మంచిది. కాపురానికి పంపమని వెళ్ళి అడుగు. ఏమంటారో చూద్దాము."

వెళ్ళి అడిగింది మహాలక్ష్మమ్మ.

కాని, ఊహించని కఠోరమైన సమాధానం-"ఎవరినడిగి పెళ్ళి చేశారో కొడుకుకు, వాళ్ళనే అడగమను." వెంకటాచలపతి ఖండితంగా చెప్పాడు.

పరాభవంపొందిన సీతవలె కన్నీళ్ళతో వచ్చింది మహాలక్ష్మమ్మగారు— గుండెలు మండుతూండగా!

ఊహాగానాల మధుమూర్తి వాస్తవ జీవితంలో ఇవ్వాళే తొలి పాఠం నేర్చుకున్నాడు!

లోకం అంటే ఏమిటో మొదటిసారిగా చూచాడు. మానవ మనస్తత్వాలలో గుంట ఓనమాలు దిద్దడం మొదలుపెట్టాడు. గంధర్వలోకం నుంచి నేలపైకి వచ్చాడివ్వాళ. అయితే ఆ వేళే అతనికి ప్రకృతితోగల బాహిర సంబంధం కూడా తెగిపోయింది. తండ్రి సకుటుంబంగా బస్తీ బయలుదేరాడు. రెండెడ్లబండిలో బలిపశువులె కూర్చున్నాడు మాధవుడు. బండి బోరుపాలాన్ని శాశ్వతంగా వదిలింది.

# 4

గుంటూరు పండరీపురంలో చిన్నయిల్లుతీసుకున్నారు రామసుబ్బయ్య వాళ్ళు. రాగానే వెంట వెంట కొన్ని నిర్ణయాలు తీసుకొని అమలు పెట్టడం-ఒకటి శ్యామలను ఆంధ్రా మెట్రిక్కై ట్యుటోరియల్ కాలేజీలో చేర్పించాడు. స్టాండర్డు బొత్తిగాలేదు కాబట్టి మూడవసంవత్సరం పంపుతామన్నారువాళ్ళు. రెండవయేడే పంపమని రామసుబ్బయ్య బేరం పెట్టాడు. ఒప్పందం కుదిరింది.

తర్వాత రామసుబ్బయ్యగారు తనశరీరారోగ్యం గూర్చి వైద్య పరీక్ష చేయించుకున్నారు. వారు బాగా పరిశీలించి రక్తపోటువచ్చిందనీ, గుండె చాలా బలహీనంగా వుందనీ ఆందోళనలూ, ఆవేదనలూ పనికి

రావనీ చెప్పారు. రెండవ పని ముగిసింది. తర్వాత ఆలోచించాడు తాను ఏమి వృత్తి చేయాలా? అని. లోగడ అనుకున్న ప్రకారం పూజలు పునస్కారాలూ చేయించి కాలక్షేపం చేద్దామనుకున్నారు కాని తీరా పరిస్థితి చూస్తే ఎవరికీ దేవాలయాలమీదా వ్రతాలమీదా శ్రద్ధకనబడటం లేదు. అంతా నిద్రలేవగానే హోటళ్ళల్లో తినడం, కోర్టులముందు కూర్చోవడం-ఇదేపని కోర్టువకీళ్ళకూ, వాళ్ళ గుమాస్తాలకీ బస్తీలలో మంచి గిరాకీ- సుబ్బయ్యగారికి వచ్చిన విద్యలకుకాదు.

సుబ్బయ్య ముందుగా ఎదుర్కొనవలసిన తీవ్ర సమస్య అర్థమయింది. అయితే ఒక నాలుగు నెలల వరకూ వెనుకాముందూ చూడ నవసరంలేని పరిస్థితులలో వచ్చాడు కాబట్టి, ఈ రోజు గూర్చి దిగులు లేదు కాని, రేపటి మాటేమిటని నేడే ఆలోచించసాగాడు. క్రమంగా తానూ కొడుకూ సంపాదించాలి. జామతోటా, ఇల్లు అమ్మి కూతురి పెళ్ళి చేయాలి. కొడుకు బస్తీ వాతావరణంలో ప్రయోజకుడు కావాలి. అప్పుడు ఒకనాడు ఠీవిగా బండిమీద-కాదు-కారుమీద తిరిగి బోరుపాలెం పోయి,కరుణను పొగిడే నోళ్ళతోనే కన్నకొడుకునులోకం పొగుడుతూంటే చూచి ఆనందించాలి. అదీ ఆ ముసలి ప్రాణంకోరిక.

అంతా మెల్ల మెల్లగా బస్తీ వాతావరణంతో రాజీ పడటం ప్రారంభించారు. కాని మ మూర్తిలో మాత్రం మార్పు కన్పడలేదు. ఒకరోజు రాత్రి పదకొండుదాటాక ఇంటికి వచ్చాడు. ఎక్కడికి వెళ్ళావని ప్రశ్నిస్తే అటు 'లాం'దాకా నడిచి వెళ్ళానన్నాడు. లాం దాదాపు 3, 4 మైళ్ళకు పైగా వుంది.

"ఎందుకు వెళ్ళినట్లు?" అని ఎవరూ ప్రశ్నించలేదు.

రామసుబ్బయ్యగారికి ఇల్లు ఇచ్చిన వ్యక్తి శివకామేశ్వరరావు గారనే అడ్వొకేటు. ఓ మోస్తరు ప్రాక్టీసు వున్నవాడు. ఆయనకు ముగ్గురూ కుమార్తెలే। పెద్దమ్మాయికి పెండ్లి అయింది. రెండవపిల్ల సుందరి-శ్యామల ఈడుది. మూడవది ఇంకొంచెం చిన్నది. ఆయన ఎప్పుడూ ఉపన్యాసాలనీ, మీటింగులనీ ఊళ్ళు పట్టుకొని తిరుగుతుంటాడు. కాబట్టి మనిషితోడు కావాలని ఎన్నాళ్ళనుండో కామేశ్వరరావు గారి భార్య వేధిస్తోంది. 'సరే'నని చివరకు రామసుబ్బయ్యగారికి ముందున్న చిన్నభాగం ఇచ్చాడు.

రామసుబ్బయ్యగారు ఒక రోజున శివకామేశ్వరరావుగారితో చెప్పాడు-"మా అబ్బాయి సంగతి కొంచెం చూడ"మని.

"ఏం చదివాడు?"

"ఏదో-సంస్కృతాంధ్రాలు."

"అబ్బే, లాభం లేదండీ! ఇంగ్లీషులో వర్కింగ్ నాలెడ్జి వుండాలి. సరే కొన్నాళ్ళు నా గుమస్తా దగ్గర కూర్చోమనండి-చూద్దాము."

రామసుబ్బయ్యగారు సంతోషించి ఆ రాత్రే కొడుకును పిలిచి గట్టిగా చెప్పాడు- "చూడు మధూ! నీవు బాధ్యత తెలియని వాడివి కావు. కుటుంబం ఎంత క్లిష్ట పరిస్థితిలోవుందో నీకు బాగా తెలుసు. ఇలా వీధులు పట్టుకుని తిరిగే రోజులు పోయాయి. అంతా ఆ కృష్ణ తో నేసరి. రేపటినుంచి కామేశ్వరరావుగారివద్ద గుమస్తా పని నేర్చుకో! ఇంగ్లీషు రీడర్లు చెల్లెలివి తీసుకొని చదువుకుంటూ వుండు."

మధుమూర్తి 'ఔ'ననలేదు-'కాద'నలేదు. మెదలకుండా వూరుకున్నాడు- తన కవితామయ ఋతుచక్రం 'కృష్ణార్పణ' మని తండ్రి అనడం వింటూ.

మరునాడు వుదయంవెళ్ళి గుమస్తావద్ద కూర్చున్నాడు.

ఆ గుమస్తా పేరు కృష్ణావతారం. పండిన తల, దానికొకపాగా, చేతిలో నశ్యండబ్బా, 'అహహహ' అంటూ పెద్దగా నవ్వుతూమాట్లాడే గొంతు. 'యక్షగానాలలో గాంధారి' అనుకున్నాడు మధు.

"ఏమోయ్! వస్తూనే నవ్వుతూ వస్తున్నావ్? అం-నీ గూర్చి వకీలుగారు అంతా చెప్పారులే. చూడు-నీ హాండ్ రైటింగ్ ఎలా వుంటుంది? "కృష్ణావతారం బిళ్ళగోచీ పైకి ఎగలాగి దోపుకుంటూ అడిగాడు.

"బాగానే వుంటుందండీ!"

"నమూనా వుందా?"

"వ్రాసి చూపుతానండీ!"

"మంచిది. ఇదిగో చూడు-ఇదొకకేసు. గోరంట్లవద్ద భూమి వివాదం. సవతితల్లికీ కొడుకుకూ వివాదం సాగుతోంది. న్యాయం తల్లి తరపునే వుంది."

"ఇంక ఆలోచన ఎందుకు? భూమి ఆమె కిచ్చేయండి।" మధుమూర్తి అన్నాడు.

కృష్ణావతారం కళ్ళజోడును ముక్కుమీదికి లాగి, అదోలా చూస్తూ, "కాని మనం కొడుకు తరపున కేసు తీసుకున్నాము. తల్లి తరపున వాదించడమేముంది? ముండా వాదం-ఏ అడ్లు వెధవైనా చేస్తాడు. అసలు మజా అంతా కొడుకు తరపున వాదించడంలోనే వుంది."

"అక్రమం" అన్నాడు మధుమూర్తి- "న్యాయాన్ని తల్లక్రిందులు చేసే అధికారం నీకు లేదు కృష్ణావతారం।" అన్నాడు కోపంగా మధుమూర్తి.

కృష్ణావతారం రెండు సార్లు ఎగిరిపడ్డాడు. మొదటిది-రెండున్నర దశాబ్దాలు, అంటే సరిగా పాతిక సంవత్సరాలు గుమాస్తా అనుభవంకల తనకు ఈ గుంటడు న్యాయాన్యాయాలు నేర్పుతున్నాడు। రెండవది- తనపై ఏకవచన ప్రయోగం।

వస్తున్న కోపాన్ని లోపలే మ్రింగి, "సరే-చూచివ్రాత తగలడు" అన్నాడు. వికృతంగా ఒక నశ్యం పట్టుపట్టి కాఫీకి లేచాడు.

మధుమూర్తికి కృష్ణావతారం నెత్తిని రెండుమొట్టాలనిపించింది. కాని తండ్రి గుర్తుకొచ్చాడు. మారుమాట్లాడకుండా ఎదురుగావున్న కాగితమూ కలమూ తీసుకున్నాడు. వెనకకు ఆనుకున్నాడు. జామిచెట్టు బదులు గోడ. తోటకు బదులు బందిఖానావంటి ఓ పాత గది-కృష్ణవేణి గలగలలకూ, జలజలలకూ బదులు దూరాంగా హారు హారన్లూ-లౌడ్ స్పీకర్లూ, మధ్యలో జూట్‌మిల్లు సైరను రొదా.

బాధగా గరగరమని కలం ధ్వని చేస్తుండగా వ్రాశాడు. వ్రాతలో మొదటి అక్షరం ప్రారంభించే సరికి, కొంత భావావేశం ప్రారంభమైంది. అలాగే వ్రాస్తూపోయాడు. చేతిలోని కాగితాలు ఎవరోలాక్కునే వరకూ తిరిగి ఈలోకపు స్పృహలేదు. కళ్ళు తెరిచి వాస్తవ జగతును చూసే సరికి-ఎదురుగా కృష్ణావతారం.

తన చేతిలో నుండి కవిత నౌకరు లాక్కొనడం ఇదే ప్రథమం.

కృష్ణావతారం ఆ కాగితాన్ని వెనకా ముందూ ఒక్కసారిగా

చూచాడు-"హౌరా-హౌరా" అని రెండుసార్లు అన్నాడు. మూడుసార్లు గట్టిగా నశ్యం పట్టించాడు. చెవిలోని పెన్సిల్‌ను తీసి బుర్రపై ఓ నాలుగుసార్లు టకటకలాడించాడు. వింతగా మధును అలాగే చూస్తున్నాడు. మధుమూర్తికి చికాకు వేసింది. అది ఒక మనిషి మరొక మనిషిని చూచే చూపుకాదు- మనిషి ఒక చిన్న చీమనో దోమనో చూచేచూపు.

"అలా చూడకపోతే నా వ్రాత ఎలా తగలడిందో చెప్పరామా?" మధుమూర్తి అన్నాడు. కృష్ణావతారం మారు మాట్లాడకుండా తన సీటులోకెళ్ళి కూర్చున్నాడు. మధ్యమధ్య మళ్ళీ రెండుసార్లు "హౌరా-హౌరా" అనుకున్నాడు.

పదిగంటలకు ప్లీడరుగారు భోజనానంతరం కోటు వగైరాలతో ఆ గదివద్దకు రాగానే మధు మృదువుగా నమస్కరించాడు. కామేశ్వర రావు గర్వంగా తలనాడించాడు. చీకాకు వేసింది మధుకు. 'ఏమి— ప్రతి నమస్కారం కూడా చేయాలని తెలియదే ఈ పెద్దమనిషికి? ఏమి ప్లీడరు? ఏమి న్యాయం?'

"కృష్ణావతారం! ఎలావున్నాడు మన కొత్త ఘటం?"

"హౌరా-హౌరా" అన్నాడు కృష్ణావతారం.

"హౌరాలేదూ, వార్తేరూ లేదు- ఇంతకూ ఏమయిందయ్యా నీళ్ళు నములుతావు?" రెట్టించి ప్రశ్నించాడు కామేశ్వరరావు.

"చిత్తం" అంటూ మధు వ్రాపిన కాగితం తీసుకొని ప్లీడరు గారి దగ్గరికెళ్ళి, "తమరిలా ఓ మాటు దయచేయాలి" అన్నాడు దూరంగా తీసుకొనిపోతూ.

"ఏమిటయ్యా అంత సీరియస్ మాటర్?" అంటూ కృష్ణావతారం చేతిలోని కాగితం తీసుకున్నాడు కామేశ్వరరావు.

పైనుంచి క్రిందిదాకా చూచాడు.

"ఏమిటీ నాన్సెన్స్?" అన్నాడు కొంచెం కోపంగా.

"చిత్తం-నమూనా వ్రాయమని పని వప్పజెప్పి కాఫీకి వెళ్ళే లోగా మీ కొత్తఘటం ఇలా చేసిందండీ!"

"ఇదేమిటీ? స్టాంపు కాగితాలపై ఇలా వ్రాశాడు?"

"అదేనండీ మజా!" ఎగతాళిగా అన్నాడు కృష్ణావతారం.

"ఏమిటయ్యా ఇది? 'ప్రేయసీ' అని ప్రారంభించాడు?"

"అదేనండీ-నాకూ అంతు పట్టడం లేదు. అందులో మూడు చోట్ల 'కృష్ణా' అన్న మాట, ఒకసారి చంద్రుడూ, ఇంకొక సారి చంద్రికా-జల జల-నిగనిగ-చాందినీ-వెండి తెర వంటి పొడిమాటలూ వున్నాయండీ! పోతే హేమంతమూ, శరత్తూ, వసంతమూ మూడు ఋతువుల పేర్లు కూడా వ్రాశాడండీ! కోర్టు పరిభాష బొత్తిగా లేదండీ!"

"అది సరేనయ్యా, ఎవరినీతడు 'ప్రేయసీ' అంటాడు?"

"అదే నాకు అంతు పట్టలేదండీ!"

కామేశ్వరరావుకు తన కుమార్తె జ్ఞాపకం వచ్చింది. కోపంగా మధును ఇవతలికి పిలిచి, "ఏమిటీ వ్రాత" అని ప్రశ్నించాడు.

మధు, "ఏం? మీరు ఆస్వాదించలేక పోతున్నారా?" అని అడుగు దామనుకున్నాడు.

లే చిగురాకు చిరునవ్వుతో, "ఎవరీ ప్రేయసి?"

"కృష్ణ."

"ఏ వూళ్ళో వుందావిడ?"

"ఒక వూరేమిటి? ఒక కాలమేమిటి? ఆవిడ ఇప్పుడు నా గుండెలలో లేదంటారా కామేశ్వరరావు గారూ?"

కామేశ్వరరావుగారికి బాగా కోపం వచ్చింది. "కోర్టు కాగితాల పై ఈ వ్రాత లేమిటయ్యా?"

"క్షమించండి! భావావేశంలో ఏదో వ్రాశాను. మీరూ నా కృష్ణను ప్రేమించి వుంటే, కోర్టులో కూడా కేసులకు బదులు ఆమె అద్వితీయసౌందర్యాన్ని, ఆ నల్లని జరజరపాకే ముంగురులనూ, ఎత్తైన లంకల చెక్కిళ్ళను వర్ణిస్తూ విలబడేవారు. కలువలూ, శైవలినీ శంఖు పుష్పాలు ఆమెకు సహజ సౌందర్యం. తరంగాలూ సుడిగుండాలే ఆమెకు చేతులూ కాళ్ళూ. పొట్టపై ముడతలూ. సూర్య చంద్రులే ఆమెకు దీపాలు."

"కృష్ణావతారం!" పెద్దగా కేక పెట్టాడు కామేశ్వరరావు.

అదిరిపడ్డాడు అవతారం- తన మీది కేమి వస్తుందోనని.

"పద- కోర్టుకు" అంటూ కోపంగా కారులో కూర్చున్నాడు.

కష్టవతారం నక్కలాగా నక్కి నక్కి కూర్చున్నాడు. కారు కదిలింది. "అమ్మయ్య!" అని నిట్టూర్చాడు మధు।

ఆ సాయంత్రమే స్పష్టంగా రామసుబ్బయ్యగారితో చెప్పారు శివకామేశ్వరరావుగారు "మీ కొడుకు పనికి రాడ" ని.

"అదేమిటి! ఒక్క పూటకేనా?"

"ఒక్కపూట ఏమిటండీ? ఈ జీవితంలో ఏ పూటా నేను పొందని అనుభవాన్ని ఈ ఒక్క పూటలో చవి చూపించాడు మీ సుపుత్రుడు."

'అదేమి' టని రామసుబ్బయ్యగారు ప్రశ్నించలేదు. 'ఫలానా' అని కామేశ్వరరావుగారు జవాబూ చెప్పలేదు.

కొంచెం ఆగి కామేశ్వరరావే అన్నాడు- "సుబ్బయ్యగారూ! పుణ్యాత్ములు. మీ జీవితం ఆధ్యాత్మికంగా సాగుతున్నది. కాని మీ కిటువంటి కష్టాలు రావడం చాలా విచారకరం. దేవుడెందుకిలా చేశాడో కాని బొత్తిగా ప్రపంచ జ్ఞానం లేనివాడండీ మీ కొడుకు-ఎలా జీవిస్తాడో ఏమో!" అని వెళ్ళిపోయాడు.

రామసుబ్బయ్యగారికీ మాటలతో తలకొట్టేసినంత పని అయింది. వెళ్ళి భార్యకు జరిగినదంతా చెప్పాడు-"ఏమో! ఈ వూళ్ళో కూడా మేము బ్రతికి బట్ట కట్టడం నీకూ, నీ కొడుకుకూ ఇష్టం లేదా?" అని తీవ్రంగా ప్రశ్నించాడు. ఆవిడ కళ్ళనీళ్ళు పెట్టుకున్నది. రామసుబ్బయ్యగారు గుండె బరువుతో అవతలికి వెళ్ళిపోయాడు.

ఒక వారం తర్వాత శ్యామల అన్నది-"నాన్నా! మీకభ్యంతరం లేకపోతే నేను టైపింగు నేర్చుకుంటాను. మా కాలేజీలో చాలా మంది అమ్మాయిలు నేర్చుకుంటున్నారు."

రామసుబ్బయ్యకు సమస్యలను గూర్చి ఆలోచించే ఓపిక కూడా నశిస్తున్నది. ప్రస్తుతం తన కర్తవ్యం కూతురి పెండ్లి, కొడుకు ఒక దారిలో పడటం. అందుకేది అవసరమో దానికి వెనుకా ముందూ ఆలోచించకుండా ఒప్పేసుకోవడం-అంతే!

వెంటనే అంగీకరించి ఒక నెల అడ్వాన్సు ఇచ్చారు. కొడుకు కన్నా కూతురే నయం-ఎంతో ప్రోత్సాహాన్ని పొందుతున్నది తనంత తానే.

మధుమూర్తి మాత్రం ఏమీ మార్పు లేకుండా అలాగేవున్నాడు. పైగా నగరం కావడం వల్ల ప్రతి రోజూ ఏదో ఒక మీటింగు జరుగుతూ వుండేది. దానికి హాజరై బాగా పొద్దు పోయాక వచ్చే వాడు.

ఒకటి రెండు చోట్ల చర్చలలో కూడా పాల్గొన్నాడు. ఒక సభలో ప్రకృతి-మానవుడు-కవి అన్నది ప్రధానాంశం. వక్తలలో కొందరు మానవుడు ప్రకృతిని జయించాలని మాట్లాడారు. 'వేదాంతంలో కూడా ప్రకృతి అంటే మాయ అని చెప్పబడి వుంది. అటువంటి దానికి లోబడకూడదు' అన్నారు వారు. మధుమూర్తి మాట్లాడుతూ ప్రకృతిని జననిగా పూజించాలన్నాడు. 'సౌందర్యం ఎక్కడ వుంది? తాజమహల్‌లో నేనా? కాశ్మీర సుందర వనాలలో నేనా? చూడగలిగిన వాడికి—ఆ కన్నులున్న వానికి- వర్షాకాలంలో మీ ఇంటి పక్క ఒంటరిగా మొలిచిన గడ్డి పువ్వులో కాశ్మీరం కన్పడదా? సాలీడు గూడులో స్వర్లోక సౌందర్యమూ, ప్రకృతి వేయి ముఖాలతో పద్మాసనస్థయై కూర్చోవడమూ గోచరింపదా?'' అన్నాడు.

సభ హర్ష ధ్వానాలతో మారు మ్రోగి పోయింది.

"కాల్పనిక కవిత్వానికి ప్రాణం ప్రకృతిని పూజించడం, ఆరాధించడం, తాదాత్మ్యం చెందడం'' అన్నాడు మధు.

ఆ నాటి నుండి గుంటూరులోని ప్రముఖ వక్తలలోనూ, సాహితీ వేత్తలలోనూ మధుమూర్తిని కూడా చేర్చుకున్నారు. మధుమూర్తి ప్రకృతిన ఉపాసించే తపస్వి అని వారు గుర్తించారు.

ఆ రోజు పూలదండలతో ఇంటికి వచ్చాడు.

శివకామేశ్వరరావూ, రామసుబ్బయ్యగారూ దేనిని గూర్చో చర్చిస్తున్నారు. మధుమూర్తి వేషాన్ని చూచి ఇద్దరూ కాసేపు సంభాషణను నిలిపారు. మధు మాట్లాడకుండా తలవంచుకొని లోనికి వెళుతున్నాడు.

"ఏమిటా దండలు?'' కామేశ్వరరావుగారు ప్రశ్నించారు.

"ఏదో సభలో కావ్యగానం చేసి వస్తున్నానండీ.''

"ఏమిటి? కృష్ణ మీద గీతమేనా?''

రామసుబ్బయ్యగారు నవ్వారు. మధు మాట్లాడకుండా లోనికి

వెళ్ళిపోయాడు. మహాలక్ష్మమ్మగారు చాలా బరువైన ఆ పూల దండను నాలుగు చిన్న ముక్కలు చేసి, ఓ రెండు ముక్కలు సుందరిని పిలిచి అమ్మ కిమ్మని చెప్పింది.

కామేశ్వరరావుగారు కేక వేసి, "ఏమే! ఇందాక ఆ క్లయింటు తెచ్చాడే పాలు-జున్నుపాలు. వాటిల్లో సగం సుబ్బయ్యగారికిచ్చావా?" అన్నాడు.

"మీరు చెప్పాలటండీ ఆ విషయం? నాకు తెలియదా? కాచాక జున్నే ఇద్దామని ఊరుకున్నాను." కాంతమ్మ జవాబు.

మహాలక్ష్మమ్మగారు వారి ఆదరణకు ముగ్ధురాలైంది. స్వంత తల్లీ తోడూ వలె చూచుకుంటున్నారు. అంతకన్నా కావలసిందేమిటి ఒక స్త్రీలో? ఈ మాటే ఆమె భర్తతో అంటే ఆయన నవ్వుతూ అన్నారు- "కారణం లేనిదే కార్యం వుండదు" అని.

"అంటే మీ ఉద్దేశం ఏమిటి?"

"వారి మనసులో ఏదో వుంది- అంతే!"

"నా కర్థం కాలేదు మీ మాట?"

"నాకు మాత్రం అర్థమయింది కనుకనా? శ్యామల గూర్చి వారు ఏదైనా ఆలోచిస్తున్నారేమోనని నా భావం."

మహాలక్ష్మమ్మ ఆశతో విని కొంచెం ఆగి, మళ్ళీ అన్నది- "ఎవరి కిద్దామని?"

"కామేశ్వరరావుగారి బావమరిది వున్నాడు చూడు-అతన్ని దృష్టిలో వుంచుకున్నారేమోనని నా అభిప్రాయం."

"మీది మరీ విడ్డూరంగా వుందండీ! ఎవరైనా ఈ రోజుల్లో అలా ఆడపిల్లల కోసం ఇలా ఆలోచిస్తారా?"

"ఏం? ఎందుకు ఆలోచించ కూడదు? శ్యామల కేం లోపమని?

మహాలక్ష్మమ్మగారు అన్నారు-"లోపం ఉంటేనా ఈ రోజుల్లో పిల్లలకు వివాహం కానిది? మీదంతా మరీ పిచ్చికాని."

ఆ రాత్రే అంతా నిద్రపోయాక ఏదో శబ్దమైనట్లు తోచి మహాలక్ష్మమ్మగారు లేచారు. ఎలుకలు శబ్దం చేస్తున్నాయి. లేచి లైటు వెల్గించలేదు. అవతల ఏవో మాటలు సన్నగా విన్పిస్తున్నాయి. మహాలక్ష్మమ్మగారు వినసాగింది.

కాంతమ్మగొంతు-"నాకీ సంబంధం ఇష్టంలేదు."

"చాల్లేనోరుమూసుకో. పెద్దగామాట్లాడకు-ఎవరైనావింటారు."

"ఎందుకు అరవకూడదు? నేను అరిచి రభస చేస్తాను రేపు! బంగారంవంటి నా పిల్లను ఏం చూసిఅతవి చేతిలో పెడదామని మీరను కొన్నారు? మనిషి ఎర్రగా బుర్రగా వుండగానే సరా! చదువూ సంధ్యా అక్కర్లేదా?"

"అదెంతసేపే! మూడు రోజుల్లో అతన్ని కోర్టులో నిల బెట్టనూ."

"ఆ(! మీరు నిలబెట్టాల్సిందే-ముద్దాయిగా. ఏ డాక్టరో ఇంజ నీరో కావాలి నాకు."

"అయితే ప్లీడర్ను చేసుకొన్నావెందుకని?"

"చాల్లెండి మీ సరసాలు- సభ్యతా, అసభ్యతాకూడా లేకుండా. నా ఉద్దేశ్యం అమ్మాయికి...."

"సంతోషించాం కాని, వాస్తవ దృష్టి లేకుండా మాట్లాడకు. ఓ పాతికవేలు ఖర్చులేకుండా ఇప్పుడు తేలికగా ఇశన్ని సంపాదించ వచ్చునని నా భావం."

శాంతమ్మగారు సణుగుతున్నారు.

కామేశ్వరరావుగారి జవాబు సరిగా విన్పడలేదు.

మహాలక్ష్మమ్మగారికి నిద్రపట్టలేదు. అంతా నిశ్శబ్దం. చిమ్మ చీకటి. కాని ఆమె గుండెల్లో మాత్రం మంటలు. మధుకు మారు మనువా? వీళ్ళ దృష్టిలో తమ కుటుంబంపై ఎంత తక్కువ దృష్టి వుందో గ్రహించింది. చౌకగా కొనివేస్తారా కొడుకును చదువులేదని? చెయ్యి పెట్టి ఆమె హృదయం కలిచినట్లయింది. ఆ ఒక్క రాత్రి సంవత్సరమంత పొడవు పెరిగింది. ఆమెకు ఏ తెల్లవారుజాముననో మాగన్నుగా నిద్ర.

తెల్లవారింది. భర్తకు చెప్పింది తాను విన్నదంతా. సుబ్బయ్య గారు 'ఔ' ననలేదు 'కాద'నలేదు. 'నేను ముందే చెప్పాను విన్నావా?' అనలేదు. కొడుకుని సంప్రదించలేదు. అదో రకమైన నవ్వువంటి సంకే తం చేశారాయన.

ఆ పూటే బ్రాడీపేటలో వేరే ఇల్లు చూచి వచ్చారు. సాయం

త్రం చెప్పారు-"కామేశ్వరరావుగారూ! మేము ఇల్లు ఖాళీ చేస్తున్నా" మని.

కామేశ్వరరావుముందు నివ్వెరపోయాడు. తర్వాత మధన పడ్డాడు. ఆపై కొంచెం చిరుకోపంగా అన్నాడు-"ఇలా అకస్మాత్తుగా పోతే ఎట్లా?" అని.

"అయ్యో! ఒక నెల అడ్వాన్సు కూడా ఇస్తున్నాం కదా! మీకింకేమి నష్టం? మేమిక శెలవు తీసుకొంటాం."

# 5

గుంటూరులో కొందరు నటీమణులు వున్నారు. వారు సాంఘిక పౌరాణిక నాటకాలల్లో వేషాలు వేసి జీవిస్తూ వుంటారు. వాళ్ళకు కొన్ని 'కంపెనీలు' కూడా వుంటాయి. అలాంటి వాళ్ళల్లో రోహిణి ఒకతె.

రోహిణి చాలా అందగత్తె! ఆమెను తొలిసారి చూచినప్పుడే మధుమూర్తి అనుకొన్నాడు- ఈమెలో అమరావతీ శిల్పశైలి మూర్తీ భవించి వుందని. దానికి తగ్గట్లు అలంకరణ విషయంలో కూడా మిక్కిలి శ్రద్ధ వహిస్తుంది. సహజంగానే నేడు రంగారాయుడూ, రోహిణీ కలిసి మధుమూర్తి వద్దకు వచ్చినప్పుడు తిరిగి అదే మాట అనుకొన్నాడు.

"ఎక్కడినుండి వస్తున్నారు?" మధు ప్రశ్నించాడు.

"ఇక్కడే నాజ్‌లో ఇంగ్లీష్ మ్యాటినీ చూచి వెళ్తూ మీ వద్దకు వచ్చాము." రంగారాయుడు సమాధానం చెప్పాడు.

"అలా వీధిలోకి వెళ్దామా?" మధు అన్నాడు.

"కాసేపు ముందు కూర్చొని మాట్లాడాలి."

"ఏమిటీ విశేషం?"

"ఏమీలేదు. మీరు మొన్న రోహిణి వేషం వేసిన సభలో

ముందుగా ప్రసంగిస్తూ పాడారే ఒక గేయంలాంటిది—అది రోహిణి జానపద నృత్యానికనుగుణంగా తాము రూపొందించి ఇవ్వాలి!" రంగా రాయుడు అన్నాడు.

మధు నవ్వి, "నాకు వ్రాయడమే కాని, దానిని మరొక విధంగా మలచి మార్కెట్‌లో పెట్టడం చేత కాదు కదా!" అన్నాడు.

"మేము మార్కెట్ రేటు ఇచ్చి మీ గేయాన్ని కొనే ధన్య వంతులం కాములెండి!" రోహిణి నవ్వుతూ అన్నది.

మధు కూడా చిరునవ్వు నవ్వి, "అమ్మా! రెండు కాఫీ తెచ్చి పెట్టు" అని కేక వేశాడు. తండ్రి ఇంట్లో లేడు-అది మధుకు ధీమా.

మహాలక్ష్మమ్మగారు కాఫీ ఇచ్చి రోహిణి వైపొకసారి సాభి ప్రాయంగా చూచి వెళ్ళిపోయింది.

"మంచిది— ప్రయత్నిస్తాను" అన్నాడు మధు.

"క్షమించండి-నేను ఒక అర్జంటు పనిమీద వెళ్ళాలి. మీరూ రోహిణీ కలిపి ఆ ట్యూను సరిచేయండి. నేను తర్వాత వచ్చి మళ్ళీ మీ దర్శనం చేసుకొంటాను." రంగారాయుడు వినయ పూర్వకంగా అన్నాడు. మధు ఆమోదించాడు.

రాయుడు వెళ్ళాక మధు తన గీతం తెచ్చి రోహిణికి మరొక సారి చదివి వినిపించాడు. చదువుతూ-భావావేశానికి లోనైనాడు. గొంతులో కొత్త జిలుగు వచ్చింది. కళ్ళల్లో కొత్త కాంతి- మన సులో కొత్త ఆరాటం. అది ఇదీ అని నిర్ణయించలేని ఏదో ఒక ఆవేదన. తన గేయం విశ్వవిహారం చేస్తున్నట్టూ, గేయం నర్తకిగా మారి గజ్జెకట్టి ఆడుతున్నట్లూ ఊహించుకొంటున్నాడు.

"హేమంత నిశాంతరాళములలో
ఏ హసంతియో పిలిచిన మాట
వాసంత తమాల వాటి కలలో
ఏ పుంస్కోకిల పలికిన పాట
పాడవే-ఆడవే!"

మధుమూర్తి కంఠం రుద్ధమైంది. భావావేశంతో కళ్ళవెంట నీటి బిందువులు.

రోహిణిలో ఆవేశం నిద్రమేల్కొన్నది. అకస్మాత్తుగా ఆమె

గజ్జలు గలగలమన్నాయి. శరీరం గానంలో కరిగి కలిసిపోయింది. పాటకనుగుణంగా ఆమె మనస్సు నర్తిస్తున్నది.

"ఆడవే-ఓ మయూరి ఆడవే!" మధుమూర్తి సప్త స్వరాలు మీటుతున్నాడు.

రోహిణి పాదాలతో పై పదాలకు భాష్యం చెప్పాలని ప్రయత్నిస్తున్నది. ఆలోక రసమయ జగత్తు. ఈశ్వర సాక్షాత్కారం.

అలా, ఎన్ని నిమిషాలు గడిచాయో-గంటలు గడిచాయో-ఎవరికి తెలుసు? లోపల ఊపిరి బిగించి భర్తరాకకై ఎదురుచూస్తున్న మహాలక్ష్మమ్మగారికి తప్ప.

వాకిట్లో శబ్దమైంది. మహలక్ష్మమ్మగారు తలెత్తి చూచారు. సుబ్బయ్యగారు కాదు- శ్యామల వచ్చింది పైపు నుండి.

గానమూ, గజ్జెల గలగలలూ ఆగాయి. ఇర్వురూ వాస్తవిక జగత్తుకు వచ్చారు.

రోహిణి శ్యామలను చూచి కొంచెం సిగ్గుపడింది. "మా చెల్లెలు శ్యామల" అని పరిచయం చేశాడు మధు. శ్యామల నమస్కరించింది. రోహిణి ప్రతినమస్కారం చేసింది.

కొన్ని నిమిషాలు ఇవీ అవీ మాట్లాడి, "మధుమూర్తిగారూ! తాము రేపు ఉదయమన్నా సాయంత్ర మన్నా రాగలరా?" అని ప్రశ్నించింది. "అలాగే" నన్నాడు మధు. రోహిణి వెళ్ళిపోయింది.

శ్యామల అన్నది- "ఎవరన్నయ్యా ఈమె?"

"ఇందాక విన్నావుగా-పరిచయం! రోహిణి అని గొప్ప నర్తకి. నాటకాలలో వేషాలు వేస్తుంది. వీళ్ళకొక ఎసోసియేషన్ కూడా ఉంది. నేనేదో సభలలో గేయాలు చదువుతున్నప్పుడు విన్నారట! చాలా నచ్చినట్లున్నాయి. ఇవ్వాళ వీళ్ళు ఇర్వురూ వచ్చి నా గేయం, నృత్యాని కనుగుణంగా రూపొందించి ఇవ్వమని కోరారు."

"అందుకు ఏమిస్తారు?"

"ఇచ్చేది ఏమిటి?"

"పారితోషికం."

మధు తియ్యగా నవ్వాడు. ఆ నవ్వులో ఇదెదో అసంగతమైన విషయమన్న అర్థం వ్యక్తమయింది. 'నేనేమిమిటి? డబ్బు కోరటమే మిటని' దాని భావం కావచ్చు.

శ్యామలకది అర్థమయింది. "మరెందుకు ఈ శ్రమ? కీర్తి కోసమా?"

"కీర్తికూడా ఒక ఆనందహేతువే కాని, నిజమైన ఆనందం-బాహ్యమైన కీర్తి నిష్టంకాదు, అంతరమైన ఆత్మనిష్ఠం."

ఈమాట శ్యామలకు బొత్తిగా కొరుకుడుపడలేదు. "అన్నయ్యా! నీవు మాట్లాడేటప్పుడు-ముఖ్యంగా నా బోటి వాళ్ళతో తెలుగులోనే మాట్లాడుతూ వుండు" అన్నది.

తిరిగి ఇలా అన్నది- "చూడన్నయ్యా! మనమేమీ ఆదర్శాలూ, ఆశయాలూ అని వీధుల వెంట తిరిగేందుకు లక్షాధికారులం కాదు. నాన్నగారి రెక్కలమీద ఆధారపడ్డ వాళ్ళం. ఆయనతో సహకరించ కుండా ఊరికే తింటూ బలాదూరుగా తిరుగుతూ వుంటే అది బాధ్యత అనిపించుకుంటుందా? ఇదేం కళారాధన?"

నిలదీసి అడిగింది శ్యామల. నివ్వెరపోయాడు మధు.

ఈ మాటలతో కళాసంబధమైన మత్తు క్రిందికి దిగజారింది.

"నీవొక ఉద్విగ్న కళాకారుడివి-నిజమే! కాని కళ కళే! తిండి తిన్నాక కళ! ఇప్పుడు నీ కుటుంబం చూడు-అది ఒక త్రోవన కుదుట పడనేలేదు. పెళ్ళి చేసుకొన్నావు సరే—మరి వదిన మాటే మిటీ? ఆవిడ కాపురానికి రాదా?"

మాట మధ్యలోనే మధు వాక్యాన్ని అందుకొని, "కాపుర మేమిటి? అసలు వదిన ఎవరో నాకు తెలియనిదే?" అన్నాడు.

"అంటే?"

"నిజం శ్యామలా! ఇందులో ఆశ్చర్య పడవలసిన విషయ మేమీ లేదు. నాకు నిజంగా హేమలత ఇలా వుంటుందని తెలియదు- తెలుసా?"

"నీవు వదినను చూడలేదా?"

"అంటే—చూశాననే చెప్పాలి. కాని నేను చూచింది పెళ్ళి పీటలపై- పురుషాహంకారానికీ, ధన దాహానికీ బలియై శోక మూర్తిగా

కూర్చున్న ఒక స్త్రీని మాత్రమే చూశాను. అంతేకాని, ఫలానా కన్ను ముక్కూ తీరుగల 'హేమలత' అన్న స్త్రీని చూడలేదు.''

"పెళ్ళికి ముందుకూడానా?''

"ఔను—ఆమె ఎక్కువ భాగం గార్లపాడులోనే వుండేదని అమ్మ చెప్పింది. ఇక్కడికివచ్చినా ఎవరింటికి ఏ ఆడపిల్లలు వచ్చి పోతున్నారో చూచే దృష్టి నాకు లేదుకదా?''

శ్యామల నిట్టూర్చింది. భార్య ముఖంకూడా తెలియని భర్త - తన అన్న! త్యాగాన్ని తేలికగా తిరస్కరించిన ఆయన అత్తామామలు! మంచికి ఫలితం-మంటలూ, గృహదహనాలు! తండ్రి సంపాదనమీద తిని తిరుగుతూ 'కళ' అంటూ ఇంటినొక నృత్యమందిరంగా మార్చబో తున్న మధు! ఏం సంసారమిది? ఎలా కుదుట పడుతుంది? వీటన్నిటికీ తోడు తన భవిష్యత్తేమిటి? తన కసలు పెండ్లి అవుతుందా— లేదా?

చిన్నదైనా శ్యామలలో ఇంగితం కొంత వికసించింది. ఆందోళనతో లోపలికి వెళ్ళిపోయింది.

అయితే మహాలక్ష్మమ్మగారి హృదయం మాత్రం రోహిణి రాకతో ప్రజ్వరిల్లిపోయింది- 'ఇల్లునిలా సానికొంపగా మారుస్తాడు కొడుకని తాను కలలోకూడా భావించలేద'న్నది మెల్లగా. 'సంసారమూ చట్టుబండలూ లేక తండ్రి పోషణపై బ్రతికేవాడికి కళకూడా ఎందు కన్నది' సణుగుతూ. 'తానుచచ్చాకకాని ఈ ఇంటికి వివేకం రాదని' మొరపెట్టింది కూతురుతో.

ఇదంతా శ్యామల విన్నది. కాని, 'ఇదేమిటని' ప్రశ్నించలేదు. తల్లికి ఎన్నడూ లేనంత తీవ్రమైన కోపం నేడిలా రావడానికి కారణ మేమో తెలియక మధు ఆందోళన పడ్డాడు. కాని అతనికి ఒక్కటి మాత్రం తెలుసు- ఇది ఈ నాటి ఒక్క సంఘటనవల్ల వచ్చిన కోపం కాదు. అనేకమైన గతాను గతికమైన సంఘటనల పరాకాష్ట ఇది! రోహిణి తన ఇంటికి వస్తే తప్పేమిటో మధుకు అర్థంకావడంలేదు. 'నాకు సమాజం అర్థంకాదు. నేనీ సమాజానికి అర్థం కాను' అను కున్నాడు మధు.

భర్తరాగానే ఆయనతో జరిగినదంతా చెప్పింది మహాలక్ష్మమ్మ.

కాని, ఆవిడ చెప్పినది నిజమే అయినా, చెప్పే పద్ధతిలోనిమార్పువల్ల ఆ సంఘటనకు కొత్తరూపం సిద్ధించింది.

"ఎవరో భోగం వాళ్ళు నా గడపలోకివస్తే, నీకొడుకు వాళ్ళకు నన్ను కాఫీలు అందివ్వమన్నాడు. ఇంతటితో చాలక ఇంటో గానా బజానా చేస్తారట! ఇది ఇల్లా, సానివాడా!" అని సూటిగా ప్రశ్నించింది.

మధు తెల్లబోయాడు. తన కళా పిపాసవల్ల లౌకిక జగత్తుకు నచ్చని పనులు ఎన్ని జరుగుతున్నాయో కొంచెం అర్థమయింది. తింటున్న అన్నం - సగంలో చేయి కడుక్కున్నాడు. హృదయం బాధతో బండబారిపోగా వెళ్ళి శరీరాన్ని మంచంపై చేరవేశాడు.

"ఇదంతా నా కర్మ!" అని గాద్గదికంతో తండ్రి అంటున్న మాట విన్పడింది.

దానితో మధు ఇక భరించలేకపోయాడు. అంతరంగంలో హాలాహలం. 'నిరర్థకమైన జీవితం నాది. సంసారం మొత్తమూ అసహ్యించుకుంటున్న బ్రతుకు నాది' అని ఆత్మనింద చేసుకుంటూ అలాగే నిద్రపోయాడు—ఏమి చేయాలో తెలియని కింకర్తవ్యతా విమూఢ స్థితిలో మరునాడు ఉదయం రోహిణి ఇంటికి యాంత్రికంగా వెళ్ళాడు.

# 6

రోహిణి, మధుమూర్తిని సాదరంగా ఆహ్వానించింది. లోనికి ప్రవేశిస్తూ మధు, రోహిణి ఇంటిని పరిశీలించాడు. ఇల్లు సామాన్యమైనదే అయినా, దాన్ని అలంకరించడంలో సౌందర్యం తొణికిసలాడేటట్లు శ్రద్ధవహించింది. గోడలకు అందమైన, కళాత్మకమైన చిత్రాలు. ఒక వైపున చక్కని ఫ్రేములో బళ్ళారి రాఘవ ఫోటో! దాని క్రింద చిన్న కొయ్యబీరువాలో వరుసగా వెండికప్పులూ, రెండు షీల్డులూ వున్నాయి.

కేన్‌సోఫాసెట్టు, టేబిలోపైన- దినపత్రికా, వారపత్రికా, ఒక స్త్రీల పత్రికా వున్నాయి.

మాటల్లోనే రెండు కప్పులకాఫీ కలుపుకొని తీసుకొచ్చింది రోహిణి.

"బ్రేక్‌ఫాస్ట్ అయిందా?"

"అయింది."

రోహిణి నవ్వింది విరగబడి. మధుమూర్తి ఆశ్చర్యంగా చూశాడు.

"మధుమూర్తిగారూ! అబద్ధమాడడానికి కూడా 'ఆర్ట్' కావాలి సుమండీ!" అన్నది కొంటెగా.

"అంటే?"

"అవును - అబద్ధమాడుతున్నట్లు చాలా స్పష్టంగా తెలిపోతున్నది. ఆమాత్రం టోన్‌మాడ్యులేషనూ, ఫేషువల్ ఎక్స్‌ప్రెషన్స్ గమనించకపోతే ఇంక మా వృత్తేమిటి?"

పనిమనిషిని పిలిచి, హోటలుకు పంపింది.

"క్షమించండి..." ఏదో అనబోయాడు మధు.

"అదే నేనూ అనబోతున్నాను - క్షమించండి — నేను రోజూ టిఫినుచేస్తూ వుంటానుకాని, ఆ పనిలో వుంటే మీతో మాట్లాడే అవకాశాన్ని కోల్పోతానని నేటికి విరమించుకున్నాను. అందుకనే హోటలుకు పంపాను."

రోహిణియొక్క ప్రతివిన్యాసమూ మిక్కిలి ఆర్ద్రంగానూ, తానంటే ఎంతో కృతజ్ఞతను సూచించేవిగానూ వున్నాయి. 'ఇదంతా నిజమా? లేక నటనా?' అని కూడా అనుమానపడే స్థితికి వచ్చాడు మధు. 'ఎందుకీమె తన్నంత గౌరవిస్తున్నది? తనలో వున్న విశేష మేమిటి? తనలో ఏదో విశేషముండి ఆమె ఇలా గౌరవిస్తున్నదని తాను భావించి తనను తానే మోసగించుకోవడంవల్ల వచ్చేసంతృప్తి కోసమా? అతిథులందరినీ ఇలాగే ఆదరిస్తుందా? లేక....?!'

"మధుమూర్తి గారూ!" రోహిణే సంభాషణ కుపక్రమించింది.

మధు సంభాషణ ప్రారంభించక ముందే ఆపి "రాయుడు గారెక్కడ?" అని ప్రశ్నించాడు.

"విజయవాడ వెళ్ళారు - ఏదో కాంట్రాక్టు వుంది. అది చూసుకొని రాత్రికల్లా వస్తారు."

దానితో మధు కొంచెం అసౌకర్యంగా ఫీలయ్యాడు. రోహిణీ అది గమనించింది.

"ఏమిటి అలా చూస్తున్నారు?" ప్రశ్నించింది.

"ఎలా చూస్తున్నాను?"

"ఏదోలా వున్నారు - రాయుడుగారు లేరనేనా?"

ఫక్కున నవ్వింది—"అంతా ఆయనలేని సమయమెప్పుడని చూస్తూంటే, మీరు లేనిసమయమంటే బాధపడతారెందుకు?"

ఈ మాటకు మధు అదోలా అయినాడు.

"నేను వచ్చింది...."

"నాకు తెలుసు మధుమూర్తీ!" వీణ మీటినట్లు అంటూ, కుర్చీని కొంచెం దగ్గరగా లాక్కొని-

"మీరు దేవలోకంలోని కామధేనువులాంటి వారు, లేదా వశిష్టుని నందినీ ధేనువు లాంటివారన్నా తప్పులేదు. ధేనువు- సత్యమూ, సింహము-ఆభాసా."

సత్యమూ-ఆభాసా అనే పదాలు ఈ సామాన్యురాలి నోటినుండి మధు ఊహించనేలేదు. అందులోనూ రఘువంశ ఇతివృత్తాన్ని తీసుకొని మిధ్యా సింహాన్ని ఆభాసగా చెప్తూ వేదాంతంలోని ఒక పరమ రహస్యాన్ని అతితేలికగా ప్రతిపాదించింది. 'ఒహో! ఏమివైదుష్యం?'

"మీరేమి చదివారు?" వెంటనే ప్రశ్నించాడు.

"నిజం చెప్పాలంటే సెకండుఫారం. కాని ఇప్పుడు బాగా వేదాంత గ్రంధాలు చదువుతున్నాను. అనేకమందితో పరిచయం-నాకు జీవితమంటే ఏమిటో నేర్పింది, వేదాంతమూ నేర్పింది."

ఈ మాటతో మధుకి ఆవిడపైన గౌరవం పోయింది. 'తన్ను పరిహాసం చేస్తున్నదా? లేక నిజంగా వేదాంతం చదువుతున్నదా? వేదాంతం చదివేదే అయితే ఈ విలాసం ఎందుకు?'

"మధుమూర్తిగారూ! నిజం చెపుతున్నాను- చూడండి" అంటూ కొన్ని పుస్తకాలు చూపించింది.

వివేకానంద సంపూర్ణ గ్రంధావళి వున్నది అందులో. ఇంకా

'మాయ' అన్న శబ్దాన్ని బుద్ధుడు, శంకరుడు, వివేకానందుడూ ఎలా భిన్న భిన్నంగా నిర్వచించారో తెలిపే పుస్తకం ఒకటి. ఇవన్నీ తాను చదివినవే. కాని రోహిణిఇంట్లో వుండటం-మధు నమ్మలేకపోతున్నాడు.

ఇంతలో టిఫెన్‌వచ్చింది. ఇర్వురూ తీసుకున్నారు. మధు కొంచెం మొగమాటపడ్డాడు. ఒంటరిగా ఒక పరాయిస్త్రీతో ఇలా చర్చలు సాగించడం లోగడ తనకు అనుభవంలేని సంఘటన. టిఫెన్ ముగిశాక వక్కపొడి ఇచ్చింది.

"మీకు వేదాంత గ్రంధాలు చదవమని ఎవరు చెప్పారు?" మధు ప్రశ్నించాడు.

"నా జీవితమే చెప్పింది."

"ఎందువల్ల? మీకామాయా సిద్ధాంతం అర్థమయిందా?"

"పూర్తిగా కాలేదు. కాని ఒక్కటి మాత్రమే అర్థమయింది-మాయంటే ఏదో కాదు - నేనే! నేనే ఈ లోకానికి మాయను. ఔను మధుమూర్తీ! మీకభ్యంతరం లేకపోతే ఆత్మీయంగా నా కడుపులోని బాధను వెళ్ళబోసుకోవాలని వుంది. వింటారా?"

"తప్పకుండా!"

"మంచిది-వినండి" అని రోహిణి తనకథ చెప్పడానికి ఉద్యమించింది. చూస్తూండగానే ఆవిడ ముఖభంగిమలు మారిపోయాయి. ఏదో లోకాలలోకి వెళ్ళి చెప్పసాగింది___

"మధుగారూ! మాది ఈ జిల్లాలోనే ఒక చిన్నగ్రామం. చిన్నదీ అంటే ఓ హైస్కూలు మాత్రం ఉన్న గ్రామం. అందులో నేను జన్మించాను. నా మొదటిపేరూ, తల్లిదండ్రులపేరూ చెప్పను-దానివల్ల ప్రస్తుతం ఏమీ ప్రయోజనం లేదు కాబట్టి.

"చిన్నతనం నుండీ నాకు సంగీతమన్నా ప్రకృతి అన్నా ఎంతో సరదా. మా ఊరివద్ద ఓ చెరువుంది. వర్షాకాలంలో అది నిండేది. ఎన్నో వేల కప్పలు వచ్చేవి. నత్తలూ, తుంగకాయలూ, నురుగులూ, నీటి పాములూ ... తిరిగి చలికాలం. అవతల తోటలో నుండి అర్ధచంద్రాకారంలో కొన్ని వందల కొంగలు చెరువుమీద వాలేవి. కొన్ని తపస్సు చేస్తుండేవి. మరికొన్ని గాలిలో తేలియాడుతూ వుండేవి. ఎన్నిరోజులు చూచినా ఈ దృశ్యాలు వదలబుద్ధిపుట్టేది

కాదు నాకు. ఫస్టుఫారం చదవడానికి స్కూలులో చేర్పించారు. స్కూలు పక్కనే ఓ పొలం వుంది. దానికి గట్లు - గట్లల్లో నీళ్ళు - నీళ్ళల్లో పాములూ - తూములనుండి జలజల పారే నీళ్ళల్లో చిన్న చిన్న చేప పిల్లలు.

"స్కూలు మానేసి నేనా తూములదగ్గర కూర్చునేదాన్ని. తర్వాత మాష్టారు ఎక్కడికి వెళ్ళావని బెదిరిస్తే నిర్భయంగా చెప్పేదాన్ని- 'పొలాలూ, చెరువూ చూద్దామని వెళ్ళాను-నాకీ పాఠంకన్నా అదే బాగుంది' అని. ఈపని ఆయనకు చాలా కోపం కలిగించింది. వెళ్ళి మా ఇంట్లోవాళ్ళకు చెప్పాడు- 'మీపిల్ల బడి మానేసి చెప్పకుంటా ఒంటరిగా చెరువులూ సమాధులు పట్టుకొని తిరుగుతున్న'దని.

"మధుమూర్తిగారూ! లోకం చాలా ఆశ్చర్యకరమైందికదా! ఇదేపని ఉత్తరకాలంలో మహానుభావుడైన ఏ వ్యక్తో చేస్తే దాన్ని ఎంతగానో పొగుడుతారు. 'ఆయన ప్రకృతిపురుషుడు, నాలుగు గోడలూ వదిలేసి నిజమైన చదువు చదువుకున్నాడు- ప్రకృతి బడిలో, ఒడిలో' అంటారు. అదేపని నేను చేసేసరికి అది గట్లు పట్టుకుని తిరగడంగా వర్ణించబడింది- చూచారా?" అని నవ్వింది.

మధుమూర్తి హృదయం కరిగిపోతున్నది. భావన, సమానమైన మరొక భావనతో తాదాత్మ్యం చెందింది.

ఏ పనిని లోకం హర్షించకుండా ఇంతకాలం నిరసించిందో, అదే పనినిచేసి దానిని ఘనంగా పొగుడుతున్న మరొకవ్యక్తి తనకీనాడు లభ్యమైంది. ఇలాంటిది జరగాలనే తాను కోరుకుంటున్నాడు.

"ఆఁ-తర్వాత?"

"తర్వాత చెప్పేందుకు ఆసక్తికరమైన సన్నివేశాలేవీ నా జీవితంలో లేవు మధుమూర్తిగారూ! నాకు సెకండుఫారంలోనే చదువు మాన్పించి పెండ్లిచేశారు. మాకు లక్ష కట్నం మామూలు. మా నాన్న అలాగే ఇచ్చాడు. నా భర్త ఇంజనీరింగు చదువుతుండే వారు. వివాహమైన రెండు సంవత్సరాలలోనే ఆయన ఒక ప్రమాదంలో మరణించారు. దానితో నా జీవితం దుర్భరమైంది. భర్త అంటే తెలియకముందే భర్త శాశ్వతంగా తెలియకుండాపోయాడు. ఆ

దుఃఖంతో మా నాన్న మరణించాడు. మరణ సమయంలో కూడా ఆయన కళ్ళకింకా పెళ్ళిపందిరే కన్పడుతూ వుందట. నిజమే! ఇంటికి వేయించిన సున్నమూ రంగులూ కూడా పూర్తిగా మాసిపోలేదు- అంతలోనే ఈ సంఘటన!

"దానితో నా బ్రతుకు మరీ శిథిలమైంది. మా అమ్మగారు రెండవపెళ్ళి చేస్తామని అన్నారట! చేస్తే ఎలా వుండేదో? కాని బంధువులు పడనివ్వలేదు. అత్తగారింట్లో దినమొక నరకంగా తయారైంది. నేను ఊహించుకునే కళాత్మక దృశ్యాలు వేరు-నిత్య జీవితంలోని సమస్యలు వేరు. శరీరంతో మనస్సు రాజీపడలేదు. మనస్సుకూ ఆత్మకూ పొత్తు కుదరడంలేదు.

"ఈలోగా ఒకటి రెండుసార్లు నామీద మా అత్తగారు పరోక్షంగా హత్యా ప్రయత్నాలు కూడా చేశారు. తన కొడుకును దిగమింగిన రాక్షసినట నేను-'ఇక భూమిమీద జీవించడమెలా?' అన్నది తర్వాత నాకొక పెద్ద సమస్య అయిపోయింది. తృప్తిగా, నిర్భయంగా గ్లాసు మంచినీళ్ళు కూడా త్రాగలేక పోయేదాన్ని. ఒక ముద్దకూడా మింగలేక పోయేదాన్ని. మా తల్లి కూడా దిగులుతో మంచమెక్కింది. నాకు అన్నలున్నారు కాని, వాళ్ళ భార్యలూ-వాళ్ళ పిల్లలూ. నా గురించి ఆలోచన నాకు తప్ప సృష్టిలో ఎవరికీ లేదని తేలింది. బ్రతుకులో ఏమీ అనుభవించలేదు. తీరని కళాతృష్ణ, ఆరని మంటలు, ఏవేవో రసమయ జ్వాలలు. బ్రతుకు చూద్దామంటే దుర్భరమైన స్థితి. లక్ష రూపాయలూ మూటగట్టుకుని కూడుకూడా పెట్టనిస్థితి. దానితో నేను నగరానికి వచ్చాను. నా జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభమైంది." రోహిణి ఒక్కసారి నిశ్వసించింది.

మధుమూర్తి శిలాప్రతిమవలె వింటున్నాడు.

"దానిని లేచిపోవడమనండి, పారిపోవడమనండి, సభ్యభాషలో కళారాధనకోసమనండి-మొత్తానికి వచ్చేశాను. నగరానికి వచ్చానే కాని ఏమి చెయ్యాలో తెలియలేదు. కొన్నాళ్ళు పడరానిపాట్లు పడ్డాను. ఆ తర్వాత పట్టుతీవాసీలాంటి నా జీవితాన్ని నగరంలో పరిచాను. దానిపైకి ఎందరో ధనవంతులు, రసికులు రావాలని ప్రయత్నించారు. అట్టి క్లిష్టదశలో నాకీ రంగారాయుడుగారి సహవాసం లభ్యమైంది.

ఆయన ఇక్కడొక ఎలిమెంటరీ స్కూల్లో పనిచేస్తూ డ్రామా కంపెనీ లకు మేకప్ సామానులు సప్లైచేస్తూ ఉండేవాడు. వారు నాకు పునర్జన్మను ప్రసాదించారు. పతనోన్ముఖమైన నా జీవన గంగకొక సాఫల్యాన్ని కనపరచారు. తత్ఫలితంగానే నేనీనాడు బ్రతికి బట్టగట్టి మీముందు కళాకారిణిగా నిలబడగలుగుతున్నాను. సమాజంలో నాకొక స్టేటస్ ఆయనవల్ల వచ్చింది."

"రాయుడుగారి ఔదార్యం చాలా చెప్పుకోదగ్గది. వర్ణాంతర వివాహాన్ని చేసుకొని తమ ఉన్నతమైన గుణాన్ని చాటుకున్నారు."

రోహిణి నవ్వింది. మధుమూర్తిలో కవిత్వం వున్నది కాని సంయమనం లేదనీ, పసితనం పోలేదనీ గుర్తించింది. తనకూ రాయుడుకూ గల సంబంధం స్పష్టంగా ఆయన తెలిసికొనగోరు తున్నాడు. నిర్మొహమాటంగా చెప్పింది.

'మధుమూర్తీ! రాయుడుగారు నాకు ఆత్మబంధువు. ఆయనకు వివాహమాడిన భార్య వుంది. కేవలం నన్ను రక్షించిన ఒక రక్షకుడు. ఆపత్కాలంలో కాపాడిన స్నేహితుడు-అంతే!"

మధుమూర్తి నివ్వెరపోయాడు. 'మరి ఏమాశించి రాయుడు ఈమెను కాపాడాడు? కేవలం తన వ్యాపార దృష్టితో చేసిన పనిగా తోచడంలేదే?'

'లోకం చాలా విశాలమైనది- (విపులాచ పృథ్వీ) ఎందరో మంచివాళ్ళుంటారు' అనుకున్నాడు మనస్సులో.

"మధుమూర్తీ!"

వాస్తవలోకంలోకి వచ్చాడు మధు.

"మిమ్మల్ని ఇప్పటికి రెండుసార్లు పిలిచాను."

"ఔను. మా ఇంట్లో అమ్మా, చెల్లెలూ వాళ్ళు ఒక్కోసారి ఐదారుసార్లు పిలుస్తూ వుంటారు" అని నవ్వాడు. "మీకభ్యంతరం లేకపోతే నా కవితను విన్పిస్తాను. దానికి మీరు అభినయాన్ని కూర్చుకోవచ్చు."

"సంతోషం."

మధుమూర్తి- శారదనూ గాన విశారదనూ దివినుండి భువికి దింపాడు. వేయి వనమయూరాలొక్కపెట్టున నర్తించాయి.

# 7

పల్లెలను భగవంతుడూ, బస్తీలను మానవుడూ నిర్మించారని మధు మూర్తి నమ్మాడు. అయితే పల్లెలలో లేని నునుపుదనం బస్తీలో గమనించాడు. పాలరాతిలోనూ నునుపుదనంవుంది. మేడిపండులో కూడా వుంది. మొత్తానికి నాగరిక వాతావరణంవల్ల మధులో కొంత లోతు పెరిగింది. పూర్వం కృష్ణానదివలె తానూ లోతులేని ఓ పొడవైన వాహినివలె జీవిస్తూ వుండేవాడు. కాని బస్తీలోని కవులూ, కళాకారులూ వారి తీరు తెన్నులూ చూచినమీదట, జీవిత మంటే ఏమిటో మధు నేర్చుకోవడంప్రారంభించాడు- ముఖ్యంగారోహిణివద్ద.

పాండిత్యం దృష్ట్యా చూచినప్పుడు నాగరికులలో నూటికొకరు పరీక్షకు నిలువగలరు. కాని బాహ్యమైన నగిషీల దృష్టితో, తళుకు బెళుకుల దృష్టితో చూచినప్పుడు పల్లెటూరి విద్వాంసులకు లేనివన్నెలూ చిన్నెలూ బస్తీలో కన్పడ్డాయి. 'పల్లెలలోని పాండిత్యం ముద్దబంగారం. బస్తీవాళ్ళది తక్కువ బంగారంతో చేయబడిన రాళ్ళ నెక్లెస్' అను కున్నాడు మధు. ఆ పల్లెలలోని సహజకవులకూ, కళాకారులకు అవ కాశాలు తక్కువ. అవకాశాలున్న బస్తీ కళాకారులకు సహజత్వం శూన్యం.

పట్టణాలలోవారికి ఆంగ్లాదిభాషా పరిచయం సులభంగా లభ్య మవుతుంది. దానివల్ల వారి బంగారానికి తావికూడా అబ్బుతుంది. కాళిదాసు గూర్చి ఒక పంక్తి చెప్పి దాన్ని షేక్స్పియరుతో సమన్వ యిస్తూ నాలుగులైన్లు చెపుతారు. దానితో విషయానికొక అంతర్జాతీయ స్థాయివస్తుంది. ఈ టెక్నిక్ మధు గమనించాడు. దానితో తానూ ఈ పాండిత్యం కొంత సంపాదించాలని నిశ్చయించాడు.

రోహిణి సాంగత్యంతో జీవితాని కొక సార్థక్యం వచ్చిందని నిజంగా మధు నమ్మాడు.

ఆమె నిర్వచించింది. "మధూ! బ్రతుకు కేవలం బ్రతుకుకొరకు కాదు- కళకొరకు. నా వ్యక్తి గతమైన స్వల్ప జీవితం అనేకవేలమంది హృదయాలలో స్పందన కలుగ జేస్తున్నపుడు-నాభావాలు విద్యుత్తులేక దశ దిశలూ వ్యాపించి వేయి దీపాలు వెల్గించినప్పుడు- సామాన్య మైన నా జీవితాని కింత కంటే ప్రయోజన మింకేమి కావాలి?" అని ప్రశ్నించింది.

మధుమూర్తిలో రోహిణి నూతనాధ్యాయాన్ని తెరిచింది.

దానితో తన బ్రతుకుకొక సార్థక్యం వుందనీ-తన జలపాతం వంటి ఆవేశాన్ని సంయమనంతో స్తంభింపజేసి అందుండి విద్యు త్తును సృజించాలనీ నిశ్చయించాడు మధుమూర్తి.

"నేను సత్యం చెపుతున్నాను మధుమూర్తీ! మీవంటి భావుకుడు, యధార్థ భావుకుడు నేడు దేశంలోనే చాలా అరుదు. అంత గొప్ప కళ మీదగ్గ వుంది. కాని ఈ బంగారు గనిని ఇంతవరకూ ఎవ్వరూ త్రవ్వలేదు. ఆ రత్నాలను వెలికితీసి ఎవ్వరూ నగిషీ పెట్టలేదు. మీరొక ఘోషిస్తున్న సముద్రం. మిమ్మల్ని ఒక వేసవి విశ్రాంతి కేంద్రం కిందికి మార్చి సమాజానికి ఉపయోగపడేటట్టు చూడాలి."

"ఆ పని మీరు చేస్తున్నారు కదా రోహిణీ?"

రోహిణి నవ్వి. అన్నది- "నేను కూడా మీకోసం చేయడం లేదు, నా కోసమే. నాలోని కళకు ఆధారం వెతుక్కొంటున్నాను."

"నాలోని కవితకు ఆలంబనం కావాలి."

"మధూ! మీరు నన్ను 'నీవు' అనలేరా? 'మీరు' అంటుంటే నేనేదో సాన్నిహిత్యాన్ని పొందలేకపోతాను."

ఈ మాటకు మధుమూర్తి ఆలోచనలో పడ్డాడు. 'ఈ మాటకు ఉన్న లోతెంత? రోహిణి తన్ను కేవలం కళాకారునిగానే చూస్తున్నదా? లేక....?'

మధుమూర్తి మనస్సులో క్షీరసాగర మధనంలోని శివుడు కనపడ్డాడు. విషామృతాలు రెండు పాత్రలలో వున్నాయి. 'విషాన్ని గొంతులోనే నిలిపి, జగత్తుకు అమృతం పంచే బాధ్యతను మరొక

రికి అప్పగించటం శ్రేయస్కరమైన పని' అనుకొన్నాడు మధుమూర్తి! దానితో తనలోని భావలహరి మెల్లగా అణగారిపోయింది.

"అలాగే రోహిణీ! నీ నర్తనం వలన తిరిగి నాలో జీవితంపై కొత్త ఆశలు పెరిగాయి. లోకంలో మనం దేనినైనా పొందవచ్చు కాని, సమాన అంతఃకరణం- భావసామ్యంగల వ్యక్తుల స్నేహాన్ని పొందడం చాలా కష్టం" అన్నాడు మధుమూర్తి.

ఈ మాటలకు రోహిణి పొంగిపోయింది. ఆ తర్వాత మధుమూర్తి మౌనంగా చాలా మాటలు మాట్లాడాడు. రోహిణి కూడా చాలా మౌన భాష్యమే చేసింది.

• • •

"మీ కొడుకు బస్తీలో సానివాడలు పట్టుకొని తిరుగుతున్నాడని ఊరు పాలెంలో ఒకటే పుకారు-ఊరు కోడై కూసున్నది" అని అక్కడినుండి వచ్చిన వారెవరో రామసుబ్బయ్యగారితో అన్నారు. ఆయన ఈ మాటలు మహాలక్ష్మమ్మగారితో చెప్పారు. మాటలు బండలవలె కొండలవలె వారి గుండెలకు బరువునెత్తాయి.

బస్తీలో ఖర్చులు పెరిగాయి- కాని, ఆదాయం ఊహించిన విధంగా లేదు. ఆస్తి కరుగుతున్నది. అప్పులు పెరుగుతున్నాయి. మధుమూర్తి ఏం చేస్తున్నాడో మధుమూర్తికే తెలియని ఉన్మాద దశలో తిరుగుతుంటే రామసుబ్బయ్య ఇక సహించలేకపోయారు.

ఒకనాడు ఇంటిపట్టున ఉన్న సమయం చూచి, "వింటున్నావా-ఇదుగో వింటున్నావా?" అని ఒకటికి నాలుగుసార్లు పిలిచి కొడుకుకు తన మాటలు వినపడుతున్నాయన్న విషయం ఖాయం చేసుకొని ఆ తర్వాత తాను చెప్పదలచుకొన్న సంగతులన్నీ చెప్పారు.

తండ్రి చెప్పిన మాటలు కొడుకుకు ఎంతవరకు తలకెక్కాయో ఎవరూ చెప్పలేరు గాని, చివరకు చాలాసేపు ఉండి ఓసారి గోడలవైపూ, మరోసారి ఇంటిపైకప్పు వైపూ చూచి మధుమూర్తి ఇలా అన్నాడు—

"నాన్నా! మీది భౌతిక దృష్టి-నాది కళా దృష్టి" అని.

రామసుబ్బయ్యగారికి కోపం వచ్చింది. మళ్ళీ కొంచెం తమాయించుకొని దాన్ని మింగివేశాడు. "చూడు మాధవుడూ! కుటుంబ

పరిస్థితి అల్లకల్లోలంగా వుంది. జబ్బునపడ్డ తల్లీ, ముసలివాడైన తండ్రీ, పెళ్ళికెదిగివచ్చిన చెల్లెలూ, కాపురానికి రాని భార్యా, ఉద్యోగమూ సద్యోగం లేని నీవూ- ఈ పరిస్థితి నీకు ఏహ్యంగానూ బాధాకరంగానూ తోచడం లేదా?''

మధుమూర్తి అన్నాడు-"లేదు నాన్నా! ఏ కళాకారుడూ ఇంత కన్నా మంచి పరిస్థితులనుండి రాలేదు.''

రామసుబ్బయ్యగా కి బాగా కోపం వచ్చింది. మళ్ళీ మరొక సారి ఆగాడు. "కళ చాలాగొప్పదే మధూ! నేనూ గొప్ప కవినే. నా సంస్కృతాంధ్ర పాండిత్యంతో ఒక మహా గ్రంథం వ్రాశాను. కాని దాన్ని ఆదరించే నాధుడేడీ? పొట్ట కూటికి గతిలేనప్పుడు 'కళ-కళ' అని దేబిరించడం శుద్ధపొరపాటు. కడుపునిండనప్పుడు కళ మన ల్నేమి ఉద్ధరిస్తుంది?''

"అక్కడే మీకూ నాకూ తేడా వుంది నాన్నా! మీరు కళతో మనం ధనవంతులం కావాలనుకొంటారు. నేను కళనొక దేవతగా ఆరాధిసున్నాను. ఆరాధన ఎప్పుడు వస్తుందో అప్పుడే ఆత్మహూతీ వస్తుంది. సర్వసమర్పణ కష్టాల ఎడల సహిష్ణుతా లభిస్తుంది.''

దీంతో రామసుబ్బయ్యగారు తిట్లలోకి దిగారు. "మాధవుడూ! నీకంటి భ్రష్టుణ్ణి నేను లోకంలో ఎక్కడా చూడలేదు. ముసలితండ్రి రక్తాన్ని ఓడ్చి సంపాదించే శ్రమను ముప్పూటలా దోచుకుంటూ 'కళ-కళ' అంటూ బజార్లో తిరుగుతూ ఏ పనికిమాలినవాడో వేసిన ఓ అణా పూలదండతో లోకంలో నన్ను మించినవాడులేడని విర్ర వీగకు. నీది అశక్త దుర్జనత్వం. పరాశ్రయమైన పాపపు బ్రతుకు. మాతాపితలను పోషించే వయస్సు వచ్చినా, వారిని నిర్లక్ష్యంచేసి వారిపోషణ మీదనే ఆధారపడే అధంగిబ్రతుకు. నీదీ ఒక జీవిత మేనా? ఛీ- పలాయనవాదివి.''

"నాన్నా!'' మధు అరిచాడు. తనపై పిడుగులవలె వరుసగా తిట్లు వర్షిస్తున్నాయి- ఉరుములూ మెరుపులతో. ప్రళయ మేఘాలు కుండపోతగా వర్షిస్తున్నాయి. తన పాపపు ఆకాశం విరిగింది. మిన్నూ మన్నూ కలిసింది.

మధుమూర్తి అక్కడినుండి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి రామసుబ్బయ్యగారికి గుండెపోటు వచ్చింది. ఆయా సంతో భారంగా మంచంపై కూలబడ్డాడు. 'పరమేశ్వరా! నేను చేసింది తప్పా? లేదు-నీ పాదాల సాక్షిగా మంచి పనే చేశాను. ఇలా నగ్నంగా తిట్టడ-కన్నా నాకిక గత్యంతరం లేదు' అని తనలో తాను కుమిలిపోయాడు.

తర్వాత మూడు రోజులవరకూ కొడుకు కన్పడలేదు. తల్లడిల్లిపోయాడు రామసుబ్బయ్య. అన్నమూ నీళ్ళూ సయించలేదు. 'ఏమైపోయాడు? ఎక్కడికిపోయాడు?? అమాయకుడూ, అర్భకుడూ వీడు దేశాలు పట్టిపోలేడు కదా?'

ఈ విచారమే ఆయన్ను క్రుంగదీసింది. కాని నాల్గవనాడు సాయంత్రం నగరంలో ఏదో సభలో ప్రసంగిస్తున్నట్లు కరపత్రం చూచి మధు వూరు వదిలి వెళ్ళలేదని నిశ్చయించాడు.

అన్నకొరకు శ్యామల రోహిణి ఇంటికి వెళ్ళింది. అప్పటికే కొంత సంభాషణ జరిగింది.

ఆ తర్వాత ఇలా సాగుతున్నది—

"ఈ నాలుగు రోజుల నుండీ మీరీ పూర్తి వివరాలు చెప్పలేదేమి?" రోహిణి మృదువుగా ప్రశ్నించింది.

"ఎందుకు చెప్పడమని ఊరుకున్నాను."

"మధుబాబూ! జీవితంలోని సంఘటనలకు మూలకారణమేదో మనం చర్చించాలి. నీవు కళాకారుడివి-నిజమే! కాని అర్థ రహితమైన నీ కళ లోకంలో వన్నెకూ వాసికీ రావడం లేదు. ఈ కాలంలో కవులనూ, కళాకారులనూ పోషించే ఏ రాజులూ, జమీందారులూ లేరు. అంటే ఒక కళాకారుడు తన జీవనమూ, ఇంటి పరిస్థితీ కూడా చూచుకుంటూ తన కళను కూడా పెంపొందించుకోవాలి. దాని ఫలితంగా అతని దృష్టి పూర్తిగా కళపై కేంద్రీకరించలేక పోతున్నాడు. జీవితం మెయిన్, కళ సబ్‌సీడరీ అవుతున్నది. అందువల్లనే నేడు దేశంలో మరొక కాళిదాసు, ఊర్వశీ, భరత మహామునీ జన్మించలేకపోతున్నారు."

"నేను చేస్తున్నది తప్పేనంటావా రోహిణీ?"

"దీనికి ఔను, కాదు అని రెండు జవాబులూ చెప్పవచ్చు.

ఆత్మపరంగానూ దేశ పరంగానూ నీవు చేస్తున్నది ఒప్పేనని చెప్పాలి. నీ వంటి మహా వ్యక్తి ప్రాపంచిక బంధాలకు దూరంగా వున్నప్పుడే ఆదర్శ సృష్టి చేయగలుగుతాడు. నా ఉద్దేశ్యం కూడా అదే. ఒకరిద్దరు ధనవంతులు నన్ను వివాహం చేసుకుంటామన్నారు. లేక అలాంటి దేదో చేసుకొంటామన్నారు. కాని నేను అంగీకరించలేదు. దాని పర్యవసానం నాకు తెలుసు. వారి చుట్టూ వున్న అనేక విలాస వస్తువులలో నేనూ ఒక జడపదార్థంగా చేరి పోతాను. నా యవ్వనాన్ని కొల్లగొట్టి. ఆ పైన చీపురుతో చిమ్మి పారబోసారు. నా బ్రతుకు వ్యర్థమవుతుంది. అందుకనే నేను ఇలా వైవాహిక జీవితానికి దూరంగానే వుండదలచాను."

మధుమూర్తి ఆలోచిస్తున్నాడు. తాను చేసిన ఒకానొక త్యాగం భయంకరమైన శాపమైనట్లు రోహిణి చిత్రిస్తున్నది.

"అంటే కళాకారులకు వైవాహిక జీవితం పూర్తిగా నిషిద్ధమేనా?"

ఈ ప్రశ్నకు రోహిణి నవ్వింది-"ఏం మీకు పెళ్ళి చేసుకోవాలని వుందా?"

మధు ఏమీ జవాబు చెప్పలేదు. తన జీవిత రహస్యాన్ని గొంతులో దాచుకున్నాడు.

రోహిణే తిరిగి అన్నది—"మధూ! కళాకారుడు అవివాహితుడుగానే ఉండాలనేది నా మతం. అప్పుడే అతడు సమాజానికెక్కువ సేవ చేయగలుగుతాడు. ఒక మిషనరీ స్పిరిట్ అతనిలో ప్రవేశిస్తుంది. ఫలితంగా సంసారం చేసి తాను సమాజంలో సాధించే దాని కన్నా ఎక్కువ ఫలితాలనే సాధించగలుగుతాడు. అందుకనే పూర్వం సన్యాసులైన మహర్షులు కళను ఆశ్రయించే వారు. కళాకారుడు- ప్రజల ఆస్తి. ఏ ఒక్క స్త్రీ పురుషునికీ లేదా కుటుంబానికీ ఆ వ్యక్తి పైన అధికారం లేదు. కాని ఇప్పటి మీ పరిస్థితి వేరు. పూర్తి కుటుంబం మీద ఆధారపడి వుంది. నీవు సంసార బంధంలో చిక్కుకొనక ముందే నీపైన బరువు బాధ్యతలు ప్రకృతి మోపింది. కాబట్టి సంసార దృష్టితో వాటి నన్నిటినీ నీవు నిర్వహించవలసిందే! లేకపోతే అది పలాయన వాదం అవుతుంది."

'పలాయన వాదం-పలాయన వాదం- ఎస్కేపిజం!' మధు మనస్సులో ప్రతి ధ్వనులు.

అయితే మధు రోహిణి ప్రజ్ఞకు ముగ్ధుడైనాడు. లోకం ఎన్ని మాటలన్నా తానొక శాపగ్రస్తుడనైన గంధర్వుడిననీ. ఈ మానవ రూపంలో వున్న మహోన్నత కళాకారుణ్ణనీ తాను అనుకుంటూ వుండే వాడు. కాని రోహిణి వన్నె పెట్టిన బంగారం. తావి అబ్బిన బంగారు కమలం. నగరంలో నడిచే మానస సరోవరం! భావహంసలకూ కళా పద్మాలకూ ఈమె కొలను.

'ఇదంతా స్వానుభవమా? లేక దైవదత్తమయిన ప్రతిభయా? అవిడ ఏదో శాపగ్రస్తురాలైన అప్సరస' అనుకొన్నాడు.

"రోహిణీ! నేను ఇంటికి వెళతాను."

"మంచిది. ముందు మీ కుటుంబ బాధ్యతలు నిర్వర్తించండి. అవి సరిగ్గాలేనప్పుడు మీకు మనశ్శాంతి కూడా వుండదు. కళ ద్వారా కుటుంబరాహిత్యాన్ని మరచిపోతున్నాను నేను. కాని కళలో మీరు కుటుంబకష్టాలనూ సమస్యలనూ విస్మరిస్తున్నారు. అదంత దీర్ఘ కాలం మీద క్షేమకరం కాదు. సమాజం దీనిని పలాయనవాదం అంటుంది."

శ్యామల ఇక అక్కడ నిలబడలేదు. పరుగెత్తుకుంటూ వాకిట్లోనుండే వెనుదిరిగి వెళ్ళిపోయింది.

ఆ రోజు సాయంత్రం మధు ఇంటికి వచ్చాడు.

తండ్రి ఏమీ అనలేదు- 'చుక్క తెగిపడ్డ చందాన వచ్చిన నిగమశర్మ' అన్న వాక్యం ఆయనకు గుర్తుకు వచ్చింది.

మధు దృష్టి మారింది ఈ పూట. ఇంటిని నిశితంగా పరిశీలించాడు- నేడు తన యిల్లు తనకే కొత్తగా కన్పడింది. ఒక మూల మాసిన బట్టలు, మరొక వైపు చినిగిన పాదరక్షలు, అవతల వంట గదిలో ఖాళీ బన రేకు డబ్బాలు, విలువైన ఒక్క కూరా లేని బుట్ట, పడకగదిలో చినిగిన పరుపు, గలీబులు లేని దిండ్లు.... 'ఓహో! ఏమి ఐశ్వర్యం!' అనుకున్నాడు. ఎన్నడూ తన యింటిని తానిలా శ్రద్ధగా పరిశీలించి యెరుగడు.

కొంచెంసేపట్లోనే తాము ఎవరెవరికి ఎంతెంత బాకీయో జ్ఞాపకం రావడం మొదలుపెట్టింది. మొన్న పాలవాడు వచ్చి, 'డబ్బు లివ్వకపోతే పాలు పోయ' నన్నాడు. పావు అయిదణాల చొప్పున, రోజుకు రూపాయి ఇరవైపైసలు- ముప్పై రోజుల పాల బిల్లు! ఛోబీకి పద్నాలుగు రూపాయలు! బొగ్గుల బస్తా అయిపోయిందని ఆ రోజు తల్లి అంటున్నది. 'కొత్త బస్తా వచ్చిందా?' లోనికి వెళ్ళి చూచాడు- లేదు. ముందీ సమస్యలు తీర్చాలి. ఇంటిని రోహిణి యింటి వలె కొంత కళాత్మకంగా తీర్చి దిద్దాలి.

మధు రెక్కలు విరిగిపోయాయి. దివినుండి స్పష్టంగా భూమి పైన రాలి పడ్డాడు. భావనలో మనస్సులో బంగారు కమలాలకు బదులు బొగ్గుల బస్తాలు తాండవమాడాయి. తండ్రిని సమీపించి ఇంటిని గూర్చి, ఆదాయ వ్యయాల గూర్చి చర్చ ప్రారంభించాడు.

రామసుబ్బయ్యగారు అనుమానంగా చూచారు కొడుకును, కొడుకు ప్రవర్తనను. ముందు నమ్మలేకపోయాడు. కాని తర్వాత నమ్మక తప్పలేదు.

పొలాలపైన రావలసిన ఆదాయం నాల్గువేలూ, ఖర్చు నాలుగు న్నర వెయ్యి లెక్క తేలింది.

"మంచిది. ఆ అయిదు వందలూ ఓ నెల రోజులలో నేను సంపాదించి లోటు పూడుస్తాను" అన్నాడు మధు.

తల్లితో మాట్లాడదామని ఇంట్లోకి వెళ్ళాడు. ఆమె అక్కడ లేదు. దొడ్లోకి వెళ్ళాడు- అక్కడ ఓ భయంకర దృశ్యం!

అశోకవనంలోని సీతవలె ప్రదోషకాలంలో భోరున తనలో తాను కుళ్ళి ఏడుస్తున్న మహాలక్ష్మమ్మగారు!

"అమ్మా! ఎందు కేడుస్తావు- నేను వచ్చాను కదా?"

మహాలక్ష్మమ్మగారి ఏడుపు ఈ మాటతో ద్విగుణీకృతమైంది. తెరలు తెరలుగా ఏడ్చింది. మధు బలవంతం చేయగా చేయగా చివ రకు మెల్లగా నరాలు తెగిపోయేలాగున చెప్పింది- "శ్యామలకు నెల తప్పింది."

మధుకి మూర్ఛ వచ్చినట్లయింది!

# 8

"చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొని లాభం లేదని అంటారు. నీకిప్పుడు చేతులు కాలాయి. అయినాసరే, ఆకులు పట్టుకోక తప్పదు. అసలు జరిగిందేమిటి? సవిస్తరంగా చెప్పమ్మా?"

శ్యామల తన్ను ప్రశ్నించే మధు ముఖం చూడలేక తలవంచుకొని రెండు చేతులతోనూ ముఖం దాచుకొని భోరున ఏడ్చింది. కన్నీళ్ళతో ఆమె ఉద్వేగం కరిగిపోవాలని ఆ ఏడుపును మధు వారించలేదు.

తర్వాత నెమ్మదిగా ఇలా చెప్పింది— "అన్నయ్యా! నాకు తల్లైనా తండ్రైనా నీవే! అందుకే అమ్మతోకూడా చెప్పని వివరాలు నీకు చెపుతున్నాను. నన్ను వారు వివాహం చేసుకుంటామన్నారు."

"ఆ వారు - ఎవరమ్మా?" మధు గద్గదికంగా ప్రశ్నించాడు.

శ్యామల చెప్పింది. "ఆయనే—ఇంగ్లీషు చెప్పే ఆయన."

"ఎవరాయన? పూర్తి వివరాలేమిటి?"

"ఇంగ్లీషు టీచర్ - బ్రాడీపేటలో వుంటారు."

"మన కులమేనా?"

"కాదనుకుంటాను."

"రామచంద్రా! అనుకుంటానేమిటమ్మా! ఇంతా అయిన తర్వాత మంచీ చెడూ ముందే విచారించనక్కరలేదా?"

శ్యామల మళ్ళీ కన్నీళ్ళలో మునిగింది.

మధుకు ప్రపంచమంటే ఏమిటో బాగా అర్థమవుతున్నది. ఊహాగానాల గగన విహారాలలో తన ఇల్లూ వళ్ళూ ఎలా కాల్చుకున్నాడో ఇంతవరకూ- ఇప్పుడే తనకు అర్థమవుతున్నది. కవిత్వపు

మత్తులో జగత్తును మరచిపోయిన తన పశుచర్యకు ఫలితం—తండ్రికి గుండెపోటు, కన్య గర్భవతిగా మారడం।

కొద్దినెలల్లో బారసాల-ఉయ్యాల-ఉరితాళ్ళపై తల్లీ, దండ్రుల శవాలు, ఊరివాళ్ళంతా తన ఇంటిపై రాళ్ళు విసరటం।

మధులో భావుకత విజృంభించబోయింది. కాని వాస్తవికాగ్ని ఆ చందన వృక్షాన్ని కాల్చివేసింది. భావతరంగాలు మధులో పెల్లుబుకలేదు.

శ్యామలను పూర్తి వివరాలు చెప్పమని నిర్బంధించాడు.

స్థాణువువలె ఆమె చెప్పింది.

శ్యామల బుద్ధిగానే ట్యుటోరియల్ కాలేజీకి, టైపుకూ వెళ్ళి వస్తుండేది. టైపునుండి వచ్చేటప్పుడు ఒకరిద్దరు రౌడీలు వీధులవెంట పడి అందరు ఆడపిల్లల వలెనే తన్నూ ఏడిపించేవారేకాని, తాను మాత్రం బుద్ధిగా ఇంటికి వస్తుండేది. అలాగే ట్యుటోరియల్ కాలేజీలో కూడా తన చదువేమో తానేమో తప్ప, వేరే దృష్టిలేకుండా వుండేది.

కాని ఇంగ్లీషు చెప్పే కుమార్ తనపై ప్రత్యేక శ్రద్ధ చూపించే వాడు. తనకా సబ్జెక్ట్ బొత్తిగా రాకపోవడం వల్ల ఆయనవద్ద క్లాసు అయిన తర్వాతకూడా వెర్బ్, ఆగ్జిలరీ వెర్బ్, ఫ్రేజులు, క్లాజులు మొదలైన వ్యాకరణ విషయాలు శ్రద్ధగా నేర్చుకుంటుండేది. అప్పుడే కుమార్ శ్యామలను మరో దృష్టితో చూడడం ప్రారంభించాడట। ఈ పన్నివేశం ప్రారంభమైన తొలిరోజులలో శ్యామలలో ఏదో తెలి యని భయమూ, మైకమూ వస్తూవుండేది. గోడలపై ఉన్న ప్రతి పినీ వాల్‌పోస్టర్‌లోనూ తన్నే అందాల కథానాయికగా ఊహించుకునేది. కుమార్ కథానాయకుడు.

కుమార్ వెంట కొన్ని సాయంత్రాలు మ్యాట్నీకి కూడా వెళ్ళింది. రెండుమూడు పార్లు హోటళ్ళకు, షికార్లకుకూడా.

'ఎంత సాహసం' అనుకున్నాడు మధు తనలో ఉక్రోషంతో.

శ్యామల మళ్ళీ చెప్పసాగింది- చివరకు పాఠాలకు బదులు ప్రేమ పాఠాలే కుమార్ మొదలు పెటాడు. ఆయన ఇంగ్లీషులో ఎం. ఎ. చదివాడట. కాని రికమండ్ చేసేవాళ్ళెవరూ లేకపోవడంవల్ల ఎక్కడా లెక్చరర్ పోస్టు రాలేదట. అనంతమైన నిరుద్యోగుల జాబితా

లోనే ఈ పోస్టుగ్రాడ్యుయేటూ చేరి, చివరకు ఈ ట్యుటోరియల్ కాలేజీ పట్టాడట. వివాహం చేసుకుంటానని త్రికరణ శుద్ధిగా ఆయన ప్రమాణం చేశాడట। దానితో శ్యామల లోబడిపోయింది.

అకాశరామన్న ఉత్తరాలు। ఫోన్‌లో కర్ణపిశాచాల బెదిరింపులు। కాలేజీ ప్రిన్స్‌పాల్ బెదిరిపోయాడు. సంస్థ రిప్యుటేషన్ చెడిపోతుందనే ఉద్దేశంతో వెంటనే ఆయనను పనినుండి తొలగించి వేరే వాళ్ళను కుదుర్చుకున్నాడట। శ్యామల గత వారం రోజులుగా కాలేజీకి వెళ్ళడంలేదు.

'విశ్లేషణీయం। ఎంత అన్యాయం!!' అనుకున్నాడు మధు కవితామయంగా అంత బాధలోకూడా.

"ఈ వివరాలన్నీ చెప్పాలనే నేను రోహిణి ఇంటివద్ద నీవు ఉన్నప్పుడు వచ్చాను. కాని చెప్పలేకపోయాను. మాట్లాడకుండా వెనుతిరిగాను."

మధు మాట్లాడలేదు.

అన్నయ్య మౌనం ఆమె గుండెలలో జ్వాలలను రేపింది.

"అన్నయ్యా। నేను కూడని పనే చేశానుకదూ?" శ్యామల బోరున ఏడ్చింది.

మధు వారించలేదు. మధు రక్తం ఇప్పుడు మలినమైంది. తన రక్తంలోని కొంత భాగం ఇప్పుడు అపవిత్ర అయిన చెల్లెలి రూపంలో నిలబడి వుంది.

'దీనికి విమోచనం లేదా? ఆవేశంలో తెలియక బుద్ధి గడ్డి తిన్నది. అమ్మా నాన్నలతో కూడా చెప్పని వివరాలు. ఆత్మీయుడ వనీ, అన్నయ్యవనీ నీకు చెప్పాను. నీవు కూడా కడుపులో పెట్టుకొని దాచుకోకపోతే నా గతి ఏమిటి? ఏ నుయ్యో, గొయ్యో చూచుకోవల సిందేనా?"

"అమ్మా। ఇది కడుపులో పెట్టుకొని దాచుకోవలసిన విషయం కాదు. కడుపు చించుకుంటే కాళ్ళపై పడుతుందని ఊరుకునే మరో- మరో సంగతి కాదు. ఎలా దీనికి పరిష్కారం? ఎంత....ఎంత సాహసం చేశావమ్మా!" మధు కన్నీళ్ళతో ఏకాంతానికి వెళ్ళి పోయాడు.

'ఈ మహా పాపానికి ఎవరు బాధ్యులు? శ్యామలా' కుమారా?'

'కాదు-నీవే-నీ పలాయన వాదమే' అని ఘోషించింది అంత రాత్మ. 'పలాయన వాదం! కశి! పలాయన వాదం!!' మళ్ళీ ప్రతి ధ్వనులు.

'ఓహో! భ్రష్టుణ్ణి నేను. అపురూపమైన చెల్లెలికి అందరి వలెనే వివాహం చేయలేకపోయాను. అందమైన పెండ్లికూతురువలెనే చూడలేకపోయాను' అని విలపించాడు.

నిజంగా ఇది పరిష్కారం లేని సమస్యా? సమస్య అంటూ వుంటే పరిష్కారమే వుండదా?? ఏమిటి తన కర్తవ్యం??

ఇందుకు రెండు మార్గాలు కనపడ్డాయి. ఒకటి-ఏ హాస్పటల్లోనో చేర్చి చెల్లెలి కడుపులోని శిశువును కాకుండా చేసి తద్వారా ఆమెను సమాజంలో కన్యగానే చలామణీ చేయించడం. 'కాని ఇది ధనికుల మార్గం - గొప్పవాళ్ళ పద్ధతి' అనుకున్నాడు మధు. రెండవ పద్ధతి-తక్షణమేవెళ్ళి కుమార్‌ను కలుసుకొని వివాహానికి ఏర్పాట్లు చేయడం. ఇంతకన్నా న్యాయసమ్మతమైన దృష్టి మరొకటి లేదని తనకప్పుడు తోచింది.

'ఒకవేళ కుమార్ తిరస్కరిస్తే? అప్పుడు....అప్పుడు తిరిగి భావి కార్యక్రమంగూర్చి ఆలోచించి నిర్ణయం తీసుకోవచ్చు!'

ఇక ఒక్కక్షణం కూడా ఆలోచించకుండా, ఆలస్యం లేకుండా లేచాడు. చెల్లెలి రక్షణ బాధ్యత తల్లికప్పగించాడు.

"ఏ క్షణాన అయినా శ్యామల ఆత్మహత్య కుపక్రమించవచ్చు. జాగ్రత్త!" అని మరొకసారి హెచ్చరించాడు.

మధుమూర్తిలో ఈ సంఘటన అపూర్వమైన పరిణామాన్ని తెచ్చింది. నవ్వుతూ తిరిగే అతని ముఖం గంభీరంగా, భీకరంగా మారిపోయింది. తీక్షణంగా లోతైన చూపులు! కార్యదీక్షను సూచించే పిడికిలి! 'జామచెట్ల మధ్య వసంతగీతాలు పాడే మధురమూర్తి ఇతనేనా?' అని ఎవరికైనా అనుమానం వస్తే అందులో ఆశ్చర్యం లేదు. వెళ్ళాడు-నేరుగా కుమార్ ఇంటికి చేరాడు!

# 9

క్రుమార్ ఏమంత ఊరూపేరూ లేని వ్యక్తి కాదు. ఒకనాడు జాతీయ పోరాటంలో పాల్గొన్న నిరంజనంగారి కొడుకు. స్వాతంత్రం రాగానే ఆనాటి పోరాటంలో పాల్గొన్న రాజకీయ బాధితులంతా తెరమరుగున పడిపోయారు. అందులో నిరంజనం ఒకడు.

మధు వెళ్ళేసరికి నిరంజనం పక్కపై వున్నాడు. ఆయన ఆరోగ్యం ఏమంత బాగాలేదు. దోమతెర, అనుకునేందుకు రెండు మెత్తలు, ఒకటి రెండు అయింటుమెంట్లు, ఒక టానిక్, అసతల ఫానూ వున్నాయి. దగ్గుతున్నాడు.

కొత్తవ్యక్తి లోనికి రాగానే ముకుళించిన కళ్ళను తెరిచి కొంచెంపైకి జరిగి ఆహ్వానించాడు.

"నేను మధుమూర్తిని." వెంటనే పరిచయం చేసుకున్నాడు.

"కూర్చో-బాబూ!" మృదువుగా పలికాడు-మళ్ళీ దగ్గుతెర వచ్చింది.

"నేనొక పనిమీద మీదగ్గరకు వచ్చాను." మధుమూర్తిలో ఆందోళన ఎక్కువైంది. అందుకనే ఏ మాత్రం ఆలస్యం లేకుండా నేరుగా ప్రధాన విషయం లోపలికే ప్రవేశించాలని తాపత్రయం.

"నిరంజనంగారూ! ఇది మీ కుటుంబానికీ నా కుటుంబానికీ సంబంధించిన ఒక భయంకర సమస్య. మీ ఇంటి పేరునుబట్టి మీరేకులంవారో నాకు తెలుసు. మీ మా కులాలు వేరు. కాని ఒక జరగకూడని అత్యాచారం మామీద మీవాడు చేశాడు."

నిరంజనం వణికిపోయాడు-"ఏమైంది బాబూ?"

ఆయన దగ్గుత్తిక చూచేసరికి మధుమూర్తి కళ్ళల్లో నీళ్ళు

తిరిగాయి. 'లోకం అంతా నరసింహారావు, వెంకటాచలాలతో నిండిలేదు. అందులో నిరంజనాలు కూడా వున్నారు' అనుకున్నాడు. వెంటనే తిరిగి చెల్లెలి పరాభవం జ్ఞప్తికి వచ్చింది. చెప్పాడు.

"నిరంజనంగారూ! ఇందులో తప్పెవరిది? సమిష్టి బాధ్యతేనంటారా?"

నిరంజనం వివరాలు విన్నాడు. ఆయన దేహం వణికి పోతున్నది. కంఠం గాద్గదికమైంది.

"నాకు తెలుసుబాబూ-వాడు అలాంటివాడేనని. నేను జాతీయ విద్యలో ప్రవేశ పెట్టినప్పుడే వాడు ఇంగ్లీషు కావాలని పట్టుపట్టాడు. చాలాకాలం పోరాడాను. కాని మొండిఘటం వినిపించుకోలేదు. అప్పుడు రాజీపడక తప్పిందికాదు. ఇంగ్లీషువాళ్ళమీద కోపంకాని ఇంగ్లీషు భాష ఏం చేసిందనే వాడి వాదానికి లొంగిపోయాను. చూచావుకదా-ముసలివాణ్ణి, ఏక్షణాన్నో హరీమంటాను. తల్లి కూడాలేదు. ముద్దుముచ్చటా చూచుకొని పెండ్లి ఏర్పాట్లు చేద్దామనుకుంటుండగానే ఇంత సాహసం చేశాడు." నిరంజనంగారికి మాటలు పెగలలేదు.

"ఛీ! నా కడుపున చెడబుట్టాడు. ఆర్థికమైన ఇబ్బందుల కారణంగా గుట్టుగా అప్పులు లేకుండా సంసారం పోషించుకోవాలనే కారణంతో వాణ్ణి ఏదైనా ఉద్యోగ ప్రయత్నం చేసుకోమంటే స్వయంగా వివాహ ప్రయత్నమే చేశాడు. ఏమిచెయ్యను బాబూ-నా విధి." నుదుటిపై మొత్తుకున్నాడు.

"మీ విధికాదు-నావిధి. ఇప్పుడు మీరు కాదంటే నా కుటుంబం ఏ నుయ్యోగొయ్యో చూచుకోక తప్పదు." మధు దృఢంగానూ, తెగింపుతోనూ పలికాడు.

"భగవంతుడా!" నిరంజనం కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

"ఇందులో దేవుణ్ణి తలచుకోవలసినంత కష్టమేమీలేదు. మధుగారూ! నేను మీ చెల్లెల్ని వివాహం చేసుకుంటాను" అంటూ కుమార్ అక్కడికి వచ్చాడు.

మధు తలెత్తి చూచాడు. కుమార్ నిలబడివున్నాడు. అనాకారి ఏమీకాదు. చాలా ఆధునికంగా వున్నాడు.

"మీ సంభాషణ కొంత విన్నాను. ఇందులో తప్పు మీ ఎవరి మీద మోపుకోనవసరం లేదు. నాదే బాధ్యత. అందుకని నేనే వివాహం చేసుకుంటాను."

ఆ తర్వాత మధు ఇంక అక్కడ ఎక్కువసేపు కూర్చోలేదు. త్వరత్వరగా ఇంటికి వెళ్ళాడు. వెళ్ళేసరికే ఏడుపులు, పెడబొబ్బలు! రామసుబ్బయ్యగారు అస్తమించారు!

# 10

మధుమూర్తి ఇందుమించు పిచ్చివాడైనాడు. అతనిప్పుడు పునాదిలేని భవనం-ఆలంబన లేని లత-గమ్యంలేని పథికుడు!

అసలు గుంటూరు ఎందుకు వచ్చినట్లు? వచ్చి ఏం సాధించినట్లు? తల్లి ఆరోగ్యం పాడయింది-చెల్లెలు శీలాన్ని కోల్పోయింది-తండ్రి అసలు ఈలోకాన్నే వదిలి వెళ్ళిపోయాడు! ఇక ఏమిటి తన ప్రగతి? ఎంత వ్యర్థజీవితం తనది!

మధు వ్యక్తావ్యక్త దశలోకి వెళ్ళిపోయాడు. కళ్ళవెంట మూగబాష్పాలు. మనస్సులో మూగబాధ. కూలిన చందన వృక్షంవలె పడిపోయాడు మాధవుడు. ఆతనిలో ఏదో అర్ధనిమీలిత నేత్రాలాపన. ఏదో తెలియని గీతం-సంగీతం.

మానవుని దేహానికన్నా మించిన చిత్రాతి చిత్రసృష్టి భూమండలంలో మరొకటిలేదు.

నరుకుతున్న చందన వృక్షంనుండి సౌరభం దశదిశలా వ్యాపించినట్లు మొదలంటా నరకబడ్డ మధు నరకజీవనం నుండి నరకాన్ని సృజించే ఒక గేయం.

కాలకూటాల నుండి ఘనమైన ముత్యాలు. విషం కక్కే పాము తలపై విలువైన మణి. మరణించే కస్తూరి మృగం నుండి మధుర సుగంధం విరజిమ్మే పదార్థం.

'ఓహో! తండ్రి మరణంలో ఏడ్చే తన గొంతు తంత్రీ నాదంవలె మ్రోగిందే!

'ఏడ్పులో సంగీతమా? లయం కూడా లయబద్ధంగా రాగ తాళాలతో శబ్దాలంకారాలతో సాక్షాత్కరించడమా?'

అర్ధ చైతన్యావస్థనుండి మధు వాస్తవ లోకంలోకి వచ్చాడు. అతనిలో కవిత్వంపై ఎనలేని కక్ష-తీరని పగ! చేతిలో గీతాన్నిచించి పారేశాడు.

తన్ను తాను వేయి విధాల నిందించుకున్నాడు. ఎంత అప్రతిష్టా కరమైన బ్రతుకు తనది.

తండ్రి మరణిస్తే ఏడ్వవలసింది పోనిచ్చి, ఆ సహజ సన్ని వేశాన్ని కవిత్వం క్రిందికి మారుస్తున్నాడే తాను!

భ్రష్టుడు-ఈజగత్తులో జీవించటానికే అనర్హుడు. ఇప్పుడు ముందు తనకు డబ్బుకావాలి-ఎలా? ఎలా?? ఏ కవిత్వం ఇస్తుంది ధనం??

లేచి నిలబడ్డాడు-ఎదురుగా రోహిణి!

స్తబ్ధుడైనాడు మధు. నోరు తెరిచి ఏదో చెప్పబోయాడు.

"నేను విన్నాను మధూ!"

తిరిగి నిశ్శబ్దం.

రోహిణి లోనికి వెళ్ళి శ్యామలను, మహాలక్ష్మమ్మనూ పలక రించబోయింది. కాని సాధ్యపడలేదు. వారి దుఃఖం చూచి మాట్లాడలేక వెనుదిరిగింది.

"మధుమూర్తి!"

మాధవుడు తలెత్తలేదు.

"నేను రాత్రే మా ఆర్కెష్ట్రాతో హైదరాబాదు వెళుతున్నాను ప్రోగాముకు."

మధుమూర్తి బదులు పలకలేదు.

"పరిస్థితులు బాగుంటేమీరూ నాతో రావలసి వుండేది.కాని...."

నిశ్శబ్దం!

రోహిణి తన వానిటీ బాగ్ తీసింది. అందులో నుండి వంద రూపాయల నోట్లు రెండు తీసి మధుమూర్తి కిచ్చింది.

మధు తలెత్తి ప్రశ్నార్థకంగా చూచాడు.

"తీసుకోండి."

"ఎందుకు?"

"మీకు అవసరం కాబట్టి."

మధుకు బాధకలిగింది. పరాయిస్త్రీ నుండి డబ్బు తీసుకొని పొట్ట పోషించుకునే హీనస్థితికి వచ్చాడు తాను. "రోహిణి నన్నెందుకిలా అవమానిస్తున్నావు?"

రోహిణి జవాబు చెప్పింది-"మీ గేయానికివి పారితోషికం. హైదరాబాదు ప్రోగ్రాము మూడు వేలకు కాంట్రాక్టు కుదిరింది."

మధు పేలవంగా నవ్వాడు-"రోహిణీ! ఎందుకు నీ ఔదార్యానికి అందమైన మేలి ముసుగులు తొడిగి తెర వెనుక నిలబెడతావు?దమ్మిడీ విలువ చేయని కవిత్వం నాది. రెండు వందలు జన్మలో నేను తీసుకోలేదు."

"నిజమే! నీ రచన విలువలేనిది-విలువకట్ట లేనిది. ఓ కానీపిరా, మరో కానీ కాగితమూ. అవే భౌతికమైన విలువలు. ఇలాగే అయితే కాళిదాసు శాకుంతలం విలువ రూపాయిన్నర, గీతాంజలి ఖరీదు రెండుంబావలా. అంతే నంటావా?"

"నిజం చెప్పు రోహిణీ! నే నీ డబ్బు తీసుకోవడానికి అర్హుణ్ణే నంటావా? కేవలం కష్ట సమయంలో కాపాడుదామని ఇస్తున్నావు కాని."

"లేదు మధుమూర్తీ! ఒక వ్యక్తి మరొక వ్యక్తిని ఎంతకాలం కాపాడగలరు? నేనేమి అనాథలకు చేసినట్లు దానమూ గుప్తదానమూ చేయడంలేదు. ఇవ్వవలచింది న్యాయంగా ఇస్తున్నాను. నిజం చెప్పాలంటే ఇవ్వవలసినంత ఇవ్వలేక పోతున్నాను- క్షమించండి." కన్నీళ్ళు పెట్టుకుంది.

మధు హృదయమూ, నేత్రాలూ కూడా ఆర్ద్రాలైనాయి. రెండు వందలు- రెండు కాగితాలు-కావి తాను కష్టంలో వున్నప్పుడు అయాచితంగా లభించిన రెండు లక్షలవి!

"నీ ఋణం నే నెలా తీర్చుకోగలను?" మధుఅన్నాడు.

"ఇది ఋణం కాదు కదా- తీర్చుకోవడానికి. అయినా ప్రతి ఫలం ఇవ్వదలచుకుంటే తగిన సమయం రాకపోదు."

అప్రతిభుడై నాడు మధు ఈ మాట విని!

దీని భావమేమిటి? ఈ మాట లోతునుకొలవడానికి తన మనస్సు నిరాకరించింది. జడప్రాయమై ఆలోచనను కోల్పోయింది.

వాస్తవలోకంలోకి వచ్చాడు మధు. రోహిణి అప్పటికే వెళ్ళిపోయింది.

అంత బాధలోను, విచారంలోను రోహిణి పైగల సద్భావంతో మధు హృదయం అమృతమయమైంది. పన్నీటిలో శ్రీ గంధం కలిపినట్లు తన సున్నితమైన యెదలో మాధుర్యాన్ని నింపుకొని కర్తవ్యోన్ముఖుడై లేచాడు. తండ్రి అంత్యక్రియలు యథోచితంగా నిర్వహించాడు.

రెండు వారాల కాలంగడిచింది. ఈ లోపల వ్యక్తిగతంగా అతనిలో పెద్ద పరిణామాలేమి రాలేదు. కాని ఇంటిలో చాలామార్పులు జరిగాయి. మహలక్ష్మివంటి గృహస్థురాలు వైధవ్యంతో మంచాన పడ్డది. చెల్లెలు చేసిన తొందరపాటు చర్య ఆమె లోలోపల శర వేగంతో పెరుగుతున్నది.

మధుకి విశ్రాంతి లేకుండా పోయింది.మళ్ళీ డబ్బు కావాలి-ఎలా!

రోహిణి హైదరాబాదునుండి తిరిగి వచ్చింది. కాని సిగ్గుతో ఆమెకు ముఖం చూపించలేక పోయాడు.

తానేదో తప్పు చేసినట్లు అంతరాత్మ బాధపడుతున్నది. ఏ పబ్లిషర్ వద్దకైనా పోతే?

తొలిసారిగా మెరుపువలె స్ఫురించింది ఈ భావం. తండ్రి గదిలోకి వెళ్ళాడు. ఆయన పూజామందిరం పక్కనే సరస్వతీదేవి పటానికి సమీపంలో కొన్ని వ్రాత ప్రతులున్నాయి. ఒకటి చేత బుచ్చుకున్నాడు. పద్య ప్రబంధమది. పుస్తకం తీసుకుంటుంటే కైటభ దైత్యమర్దనునిగాదిలి కోడలు కంట తడిపెట్టలేదు.

మధు విషాదంగా నవ్వుకున్నాడు. 'యుగధర్మమే మారింది' అనుకున్నాడు. తన దొక గీతాల సంపుటి తీసుకున్నాడు. దాని పేరు

'కృష్ణ' కనీసం ఓ వెయ్యి రూపాయలకన్నా దానిని అమ్మాలని అను కున్నాడు. నేరుగా ఒక ప్రచురణ కర్తవద్దకు వెళ్ళాడు.

ఆయనపేరు రాజరత్నం.

రాజరత్నం మధుని చూచి ఎవడో పుస్తకాలు కొనుక్కునే బేరగాడు వచ్చాడనుకొని ముఖాని కొక కృత్రిమమైన వ్యాపారపు నవ్వు అంటించుకొని సకిలించాడు.

"రండి-లోపలకి రండి."

మధు వెళ్ళి కూర్చున్నాడు. షాపునూ పుస్తకాలనూ ఒక సారి చూచాడు. రాజరత్నంగారి ఇల్లు అదే. ఇంటి ముందుగదిలో దుకాణం పెట్టుకున్నాడు.

"రాజరత్నంగారూ! నమస్కారం. నాపేరు మధు."

"చాలా సంతోషం. కాలేజీ లైబ్రరీలకు పుస్తకాలు కొనడం కోసం వచ్చారా బాబూ?"

"కాదు. వేరేపనిమీద వచ్చాను. మీవద్ద ఏమేం పబ్లికేషన్సు వున్నాయి?"

"అన్నీ వున్నాయండీ! హైదరాబాదు, విజయవాడలలోని పబ్లిషర్స్ అందరి పుస్తకాలు కూడా నేను డిస్ట్రిబ్యూట్ చేస్తుంటాను. ఎక్కాల పుస్తకాలనుండి వాల్మీకి రామాయణం వరకూ సమస్త సంస్కృతాంధ్ర ఆంగ్ల గ్రంధాలువున్నాయి. రతీమన్మధ, శుకసప్తతి, మదనకామరాజు కథలు,వాత్సాయన కామసూత్రాలు, 'గుద్దుకొకముద్దు' 'ఎవడైనా నా మొగుడే' వంటి డిటెక్టివులూ, సెక్సుపుస్తకాలు, కొవ్వలి, జంపన, చలం, విశ్వనాధ, నోరి, బాపిరాజు, శివప్రసాద్ మొదలైన వారి సాహిత్యమూ- అన్ని పుస్తకాలూ వున్నాయండీ! ఏంకావాలి మీకు?"

"అది కాదు-నేను వచ్చిన పని వేరు. నా వద్ద 'కృష్ణ' అనే కావ్యం వుంది. దానిని మీరు అచ్చువేస్తారేమోనని అడుగుదామని వచ్చాను"

క్షణంలో రాజరత్నం ముఖం ఊసరవెల్లి వలె మారింది.

"కావ్యమా! అచ్చు వేయడమా!!" అన్నాడు ఆశ్చర్యార్థకంగా రాజరత్నం.

"ఔను."

"పద్యాలా?"

"కాదు-గేయాలు."

"ఏదో ఒకటి నా పిండాకూడు. పద్యాలు పోవండి! గేయాలైనా సినిమా పాటలైతేనే పోతాయి. అందులో కూడా సెక్సుబాగా వుండాలి.

"'రెండూ జాగర్త-ఆ రెండూ జాగర్త-నీ రెండూ జాగర్త. పై రెండూ జాగర్త'" అని ఓ అరగంటసేపు లంగా పైకెత్తి గెంతుతూ పాడి, చివరకు ఆమె కళ్ళు చూపిస్తే సరి-'రెండు' అంటే బుద్ధిమంతులు రెండు కళ్ళు అనుకుంటారు. బుద్ధిలేని వాళ్ళు ఇంకేదో అనుకుంటారు. నిజానికి ఇంకేదో అనుకోవాలనే మన ఉద్దేశ్యం. కళకు సామాజిక ప్రయోజనం ఉండాలంటే ఇదే అర్థం. ప్రజలకు ఆకలి వుంది- ఆకలి గేయాలు వ్రాయి. కామం కావాలి- సెక్సు పద్యాలు వ్రాయి"

"రాజరత్నంగారూ! నేను అలాంటివి వ్రాయలేను. నా 'కృష్ణ' సంగతి చూడండీ!"

"కృష్ణ ఏమిటయ్యా? కృష్ణా, శోభన్‌బాబు అనీ ఇట్లా నటుల పేర్లు పెడితే అభిమాన సంఘాలవాళ్ళతో దెబ్బలాటలు వస్తాయి. మంచిగా 'పన్నీరులో పంది' అని పేరు పెట్టు. మన జనాలకు ఇలాంటి పేర్లంటే ఇష్టం. ఈ మధ్య చూడు- మనుషులు నటించిన సినిమాలు జనం చూడటం లేదు-ఏనుగులు, పాములూ, పొట్టేళ్ళూ, కుక్కలూ నటించిన సినిమాలు చూస్తున్నారు. గుడ్డలు విప్పుకొని పంది నగ్న నృత్యం చేస్తూ వుంటుంది. నీ కవిత్వమంతా ఉపయోగించి దాని తొడల మీద బూతు పాటలు వ్రాయి- కనక వర్షం కురుస్తుంది. అంతేకాని మాకు కృష్ణలూ గోదావరులూ అక్కర్లేదు."

మధుమూర్తికి జుగుప్స కలిగింది. దానికి తోడు రాజరత్నం మరో సంగతి చెప్పాడు-

హైదరాబాదులోనూ విజయవాడలోనూ కొందరు అమ్మాయిలు వున్నారట. వాళ్ళు సెక్సీగా ఫోజులు పెట్టి నగ్నంగానూ అర్ధనగ్నంగానూ నిలబడతారట. ఆ ఫోటోలు తీసి వాటి చుట్టూ కథలు అల్లి

పుస్తకాలుగా వేస్తే వాటిని రహస్యంగా అమ్మేందుకు కొన్ని అండర్ గ్రౌండ్ కేంద్రాలు ఉన్నాయట.

"అలాంటి పుస్తకం ఒకటి వ్రాసి ఇవ్వగలవా? పుస్తకం చదువుతూంటే కాలేజీ పిల్లలకు పిచ్చెక్కిపోవాలి. మగవాళ్ళంతా 'రేపు-రేపు' అని ఇవ్వాళే అరుస్తూ బజారున పడాలి. ఫోటోల సంగతి - నేను చూచుకుంటాను- పుస్తకం నీవు వ్రాసి ఇవ్వు. దానికి ఇంటర్నేషనల్‌లో మార్కెట్ వుంటుంది."

మధుమూర్తి స్తంభించి పోయాడు. నోట మాట రాలేదు.

రాజరత్నం మధుమూర్తి దురవస్థ చూచి, "ఇంతకూ నువు వ్రాసింది ఏమిటీ?" అని అడిగాడు.

మధుమూర్తి కొంచెం ధైర్యం తెచ్చుకొని తన 'కృష్ణ' లోనుండి ఓ రచన చదవడం మొదలుపెట్టాడు. అది విని రాజరత్నం భార్య లోపలి నుండి షాపులోకి వచ్చింది. మధుమూర్తి చదవడం మొదలు పెట్టేసరికే కొంచెం కొంచెం ఊహాలోకాలలోకి ప్రవేశించాడు. "సుందరీ-సుందరీ!" అంటూ లేచి నిలబడ్డాడు.

రాజరత్నానికి భయం వేసింది. "ఏమయ్యా పెద్దమనిషీ! ఇంక వెళ్ళు-ఇంక వెళ్ళు" అని మధుమూర్తిని బయటకు గెంటాడు.

వీధిలోకి వచ్చాక గాని మధుకి ఆవేశం తగ్గలేదు. అప్పుడు తెలిసింది తానెక్కడ వున్నాడో! కానీ అలౌకిక జగత్తులో చేస్తున్న అన్ని ప్రయత్నాలలోనూ విఫలమవుతున్నాడు. ఎందువలన? చుట్టూ చూచాడు.

రోడ్డు నిండా మనుషులు, మనుషుల తలలు, తలల తలపులు, తలపుల వలపులు, వలపుల విలాపాలు!

ఆకారులూ- అనాకారులూ, విద్యావంతులూ-విద్యావిహీనులూ, ధనవంతులూ- ధనహీనులూ, అందరికీ భావనలే-అన్నీ ఆలోచనలే, అందరికీ సమస్యలే!

కాఫీలోకి పంచదార లేదని సామాన్యుని వేదన. గంజిలోకి ఉప్పులేదని రిక్షా వాడి బాధ. భార్య మెడలో రవ్వల నక్లెస్ అలంకరించలేదే అని మరొకరి ఘోష.

తన కవిత్వానికి వెయ్యి రాలేదని తన ఏడుపు. ఏమి సహజమిది?

నిన్న కాక మొన్న పట్నానికి వచ్చాడు తాను. నేడే క్రొత్తగా మార్కెట్టులో అడుగుపెట్టాడు. మెట్రికు కూడా ప్యాసు కాలేదు తాను. ఎవ్వరి ఆశ్రయమూ లేని తాను ఎలా ధృవతార కాగలుగుతాడు?

తన పంచ కావ్యాలూ, ప్రబంధ పాండిత్యమూ, భావుకతా ఎవడికి కావాలి? ఎవరు లక్షల విలువ కడతారు తన కవనానికి?

ఎదురుగా రిక్షా లాగుతున్న ఒక శ్రామికుడు కన్పించాడు. రోజు కూలీ రూపాయిన్నర రాగా తిండికి మిగిలి, టీ నీళ్ళు, బీడీలకు మిగిలితే వాడికి సంతోషం. కాని తాను? రెండు పుస్తకాలకు వెయ్యి కోరుకుంటున్నాడు? సమంజసమేనా? వాటి కంత విలువ ఉందా?

విలువ ఎలా వస్తుంది? వస్తువును బట్టా-లేక దానికి సమాజం విలువను నిర్ణయించడాన్ని బట్టా? రిక్షా వాని కన్నా తన బ్రతుకు హీనమైందా?

మిధ్యనుండి వాస్తవంలోకి వచ్చాడు మధుబాబు. కాళ్ళీడ్చు కొంటూ ఇల్లు చేరాడు. ఆ రాత్రి నిరంజనంగారు అకస్మాత్తుగా వచ్చాడు. మహాలక్ష్మమ్మగారిని పలకరించాడు.

ఆమె నిలబడి కళ్ళనీళ్ళు పెట్టుకొంది. నిరంజనం ఓదార్చాడు. మధుమూర్తితో మంచి చెడ్డలు చర్చించాడు. శ్యామల లోనికి వెళ్ళింది కాఫీ పెట్టడానికి. అది గమనించి వెంటనే వారించాడు.

"రాత్రి ఫలహారం కూడా ముగించి వచ్చాను, ఇంకా కాఫీ ఏమిట"న్నాడు.

"గతికితే అతకదని భయమేమో అన్నగారికి" అన్నది మహాలక్ష్మమ్మ.

నిరంజనం తమాషాగా నవ్వాడు. అందులో ఏదో భావం కూడా అంతర్గర్భితమైవుంది.

తిరిగి తానే ఇలా అన్నాడు- "అమ్మా! ఉన్నమాట చెపుతున్నాను. ఇప్పుడు గతికినా గతకకపోయినా ఈ సంబంధం చేసుకోక తప్పదు. నేను పెద్ద ఆదర్శవాదిని కాదు. వర్ణాంతర వివాహాలకొరకు బద్ధకంకణుడినై ఉండలేదు. కాకుంటే దేశప్రేమతో త్యాగాలుచేసినమాట నిజమే! దానికి ప్రతిఫలం అనుభవిస్తున్నాను. అది వేరే సంగతి. అయితే నా కొడుకుకు మా కులంలోనే ఓ పిల్లను తెచ్చి చేయాలనీ,

తద్వారా డబ్బువస్తే తీసుకోవాలనీ కూడా అనుకుంటూ ఉండేవాణ్ణి. తమంత తాము ఇవ్వగలిగిన న్యాయమైన మొత్తం తీసుకోవడం పీడించినట్లు కాదని నా భావం. అయితే ఇది సంఘసంస్కరణల విషయంలో ఆదర్శవాదులైన వారికి నచ్చకపోవచ్చు-పోనీయండి. నేను చెప్పేదేమీ వేదవాక్యమూ, సకలజన సమ్మతమూ కాదుగదా, కేవలం ఒక్కడి వ్యక్తిగతాభిప్రాయం."

మధుమూర్తి గుండెలు బరువెక్కాయి.

నిరంజనంగారు అన్నారు-"అయితే ప్రస్తుత పరిస్థితి వేరు. ఇప్పుడు శ్యామలను చేసుకోవడం తప్ప మీకూ మాకూ గత్యంతరం లేదు. పిల్లలుచేసిన మంచీ చెడూ తల్లిదండ్రులను కూడా చుట్టు కొంటుంది. నేను వ్యక్తిగతంగా ఎవరైనా వర్ణాంతర వివాహాలు చేసుకుంటుంటే అధ్యక్షత వహించకపోయినా, నలుగురితో కలిసి చప్పట్లు చరిచిరాగలను. కాని నేను నా కొడుక్కి అలా చేయవలసి వస్తుందని ఎన్నడూ అనుకోలేదు. 'దానికేమి- కాలం మారింది. లోకంలో ఇలాంటి సంఘటనలు ఎన్నో జరుగుతున్నాయి' అని తృప్తి పడగలను. నాలోని అసంతృప్తిని- సమాజభావనా, సాంఘిక పరిణామమూ కప్పివేస్తుంది. తృప్తిగా నేనూ ఇప్పుడు అక్షతలు వాళ్ళ నెత్తిన వేసి ఆనందాన్ని పొందుతాను." చెమర్చే కళ్ళను పై పంచెతో అద్దుకున్నాడు నిరంజనం.

మధుమూర్తి. తండ్రి మరణంవల్ల ఉత్పన్నమైన పరిస్థితిని వివ రించాడు. ఏమిచేయాలో బోధించమని కోరాడు.

"వెంటనే మామూలు స్థాయిలో పెళ్ళి చేయించండి. దీనికేమీ పెద్ద సంఘ సంస్కరణల కలర్ వేయనక్కరలేదు. ఏ మంత్రులూ సామంతులూవచ్చి ఉపన్యాసాలు ఇచ్చి వెళ్ళనక్కరలేదు. ఆర్థికమైన ఆర్భాటంలేకుండాచూడండి.మీ కష్టపరిస్థితి నాకు బాగా తెలుసు"లేచాడు.

మధుమూర్తి మనస్సులోనే నిరంజనంగారికి ధన్యవాదాలు సమ ర్పించాడు. రెండు కళ్ళవెంటా రెండు నీటి బిందువులు వచ్చి కను కొలుకుల్లో నిలిచాయి.

"తమరు ఇంత రాత్రి వచ్చారు?" మహాలక్ష్మమ్మ అనున యిస్తూ అన్నది.

"తప్పదు కదా! మంచి పూట చూచి అనవాయితీగా వచ్చాను. ఆలస్యం లేకుండా ప్రయత్నాలు చేయి బాబూ!" మధుతో చెప్పి బయటకు నడిచాడు నిరంజనం.

కుమార్ కేవలం సాక్షీభూతుడై ఇంతసేపూ ఉండి తిరిగి తండ్రిని అనుసరించాడు.

తండ్రీ కొడుకులు వెళ్ళిపోయారు.

మహాలక్ష్మమ్మగారు చెప్పింది-"మాధవుడూ! ఒకసారి అర్జంటుగా మన పాలేరుకు కబురుపెట్టే ఏర్పాటు చూడు."

"అలాగేనమ్మా!" మధు మరేమీ మాట్లాడలేదు.

ఆ తర్వాత ఇంక ఎవరూ ఏమి మాట్లాడలేదు. అంతా పడుకున్నారు. అయితే నిద్రిస్తున్నారో లేదో ఎవరికి తెలుసు?

బహుశా ప్రతివాళ్ళూ రెండవ వాళ్ళ గూర్చి ఆలోచిస్తూ గడిపినట్లున్నారు.

తెల్లవార్లూ చీకటి-కాటుకవలె కుండపోతగా కురిసింది. మధుకు తెల్లవారుజామున ఒక కల- కాటుక కంటి నీరు చనుకట్టు పయిన పడగా కైటభ దైత్యమర్దనుని గాదిలి కోడలు ఏడుస్తూ కన్పడ్డది.

మధుకు మెలకువ వచ్చింది. కోడికూత-దూరాన జూట్‌మిల్లు ధ్వని- బ్రాడీపేటవద్ద రైలు ఇంజను శబ్దం- ఎక్కడో భజన చెస్తున్న సన్నని పాట.

ఇక నిద్రపట్టలేదు. అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు. మనస్సు నిదలేస్తే ఉండవలసినంత ప్రశాంతంగా లేదు. కాలకృత్యాలు నిర్వహించుకొని గుడ్డలు వేసుకొని బయలుదేరాడు. అప్పటికి తెల్లవారింది. హోటల్లో ఓ రెండు ఇడ్లీ- సాంబారుతో తిని, ఓ కప్పు కాఫీ తాగి నేరుగా రోహిణి ఇంటికి వెళ్ళాడు. రోహిణి మధును చూచి ఆశ్చర్యంగా "ఏమిటి అలా వున్నా"రని ప్రశ్నించింది.

"ఎలా వున్నాను?"

"టైఫాయిడ్ నుంచి లేచిన వాడిలా వున్నారు."

"నిజమా? రాత్రి సరిగ్గా నిద్రలేదులే" అన్నాడు.

"ఇది ఒక రాత్రి నిద్రలేమి ఫలితం కాదు-కొన్ని నెలల లేదా సంవత్సరాల మానసిక శ్రమను కోల్పోయిన ఫలితం."

ఈ మాట మధుకు సరిగ్గా అర్థంకాలేదు. దేన్ని గూర్చి అంటున్నది రోహిణి. తన పుస్తకాల అమ్మకం గూర్చేనా? అయితే ఈమెకెలా తెలుసు?

"రోహిణీ! నేనిప్పుడు ఇక్కడ ఎక్కువసేపు కూర్చొని కాలక్షేపం చేసే తీరికలేదు. అవతల బోలెడంత పనివుంది. ఓ ముఖ్య..." మాట పూర్తికాకముందే.

"నాకూ మీతో బాతాఖానీ కొట్టే తీరికలేదు. అవతల బోలెడంత పని వుంది. వెళ్ళి డాన్సు నేర్పాలి."

"ఎవరికి?"

"పిల్లలకు."

"ఏ పిల్లలకు?"

"నేను స్థాపించిన నృత్యనికేతనం పిల్లలకు."

"అదెప్పుడు?"

"ఎప్పుడంటే-ఇప్పుడే. దానికి నెలలూ వారాలూ కావాలా? ఔదార్యానికి ఏ క్షణమైనా సరిపోతుంది కదా! ఉచితంగా డాన్సు నేర్పే పాఠశాల పెట్టాను."

"చాలా మంచి పని. కాని డబ్బు?"

"నాకెంత కావాలి డబ్బు? ఇంటి అద్దె, తిన తిండి- అంతే కదా? ఆ మాత్రం డబ్బు రాకపోదు. అందుకే నేను డబ్బుకై నాట్య ప్రదర్శనాలు ఇవ్వడం కూడా మానుకొన్నాను."

మధు అప్రతిభుడైనాడు. "నిజమా?" అని బలహీనంగా ప్రశ్నించాడు.

రోహిణి నవ్వింది.

"ఎందుకిలాంటి నిర్ణయం తీసుకున్నావు?"

"నా సంతృప్తికోసం. కళను అమ్మకానికి పెట్టకుండా వుంటే జీవితం ఎలా వుంటుందో ప్రయోగంచేసి చూడాలని వున్నది."

మధు వ్యంగ్యంగా నవ్వి, "దానికి ప్రయోగం ఎందుకు? ఫలితం కూడా వచ్చిన నా జీవితం ఉంది కదా!" అన్నాడు.

రోహిణి ఎగతాళిచేస్తూ అన్నది-"మధుబాబూ! మీ అశక్తతకు మీరే కారణం కాని, మీ కళకాదు. మీ చేతిలో వున్న వజ్రాయుధాన్ని

కొండలను కుమ్మడానికికాక, పలక బలపం వలె ఉపయోగించాలని చూచారు. గనిలో దొరికాయని రత్నాలను బజారులో విపణునికి ఇవ్వక బాయిలర్‌లో వేస్తే-నీళ్ళు కాచుకోవడానికి. ఎలా వుంటుంది? నేనెన్నడూ కళను అగౌరవపరచలేదు. ఇప్పటి నా నిర్ణయాలతో ఇంకా ఆ గౌరవాన్ని కళ ఎడల ఇనుమడింపచేస్తున్నాను."

"అంటే, డబ్బులు సంపాదించవద్దని నాకు బోధించదలిచావా రోహిణీ! నీవంటి వాళ్ళ దగ్గర అడుక్కొంటూ బ్రతకమని చెప్పదలిచావా? నేనింకా ఎంతకాలం పరాన్నభుక్కువలె ఈ జీవితాన్ని గడపాలని నీ ఉద్దేశం?"

రోహిణి ఒక్కక్షణం ఆగి, "ఇప్పుడు మీ అవసరాలేమిటి?" అని ప్రశ్నించింది.

"చెల్లెలు పెళ్ళి చేయాలి. తల్లి ఆరోగ్యం సరిచేయాలి. ఓ ఇల్లు చూచుకోవాలి. నాకు నేను కొంత విద్యావంతుణ్ణిగా కావడానికి కృషి చేయాలి. నా కాపురం కుదుటపరచుకోవాలి."

రోహిణి నవ్వుతూ, "భార్యను కాపురానికి తెచ్చుకోవాలి" అన్నది. మధుమూర్తి స్తంభించిపోయాడు.

"నీకు విషయం తెలుసునా?"

"ఔను."

"ఎలా?"

"అదేమిటి? తెలుసుకోవాలంటే ఎన్నో మార్గాలుంటాయి. ఏ శ్యామలైనా చెప్పవచ్చు మాటవరసకు."

మధుమూర్తి ఏదో చేయకూడని పని చేసిన వానివలె తల్లడిల్లిపోయాడు. తనకావిడ ఎడల ఎలాంటి భావం వుంది? రోహిణికి కూడా తన యెడలనో? ఏమో! మరి ఈ ఆదరాలూ, అభిమానాలూ... కళాత్మకాలా? మధు మాట్లాడలేదు.

రోహిణే అడిగింది- "మరి చెల్లెలి పెండ్లికి డబ్బు ఎలా?"

"అదే చూస్తున్నాను. బోరుపాలెంలోని మా జామతోట పాలేరుకో మరెవరికో అమ్మివేసి, ఈ కష్టాలనుండి గట్టెక్కాలనుకొన్నాను. ఈ ఆలోచనలు కార్యావస్థకు చేరకముందే నాలో ఒక సంధిగ్ధావస్థను

నీవు తెచ్చి పెట్టావు. నీవు నాకు చెప్పదలచిన సందేశమేమిటి నీ చర్యల ద్వారా?"

"మధుమూర్తీ! నేను సందేశాలూ ఉపదేశాలూ ఇచ్చేటంత సాహసం కలదాన్నీ, అర్హురాలినీ కాదు. మీకన్నా సామాన్యమైన దాన్ని. మీ అంతటి కళాకారిణిని కూడా కాదు. కాకుంటే నేను చెప్ప దలచుకొందల్లా ఒక్కటే-ప్రాణంపోయినా సరే కళను కిలోలలో తూచకండి. అది మానసిక అవ్యవస్థకూ, బుద్ధిహీనతకూ చిహ్నం."

"రోహిణీ!"

"అవును. అదే నేను చెప్పదలచుకొన్నది. మీరు మీ కళలతో లక్షలు సంపాదించండి. కోట్లకు విలువ కట్టండి. లేదా దేవతా స్వరూపం వలె ఉపాసించండి, ఆరాధించండి. అదంతా మీ ఇష్టం. కాని దాన్ని బజారుపాలు చేయకండి. మానవుడు సృష్టిలో చాలా విలువైన వ్యక్తి. ఆ మానవత్వపు విలువలూ, జీవన సారాంశమూ సంస్కరింపబడి అందంగా ఆవిష్కరింపబడితే అప్పుడు అది 'కళ' అని పించుకొంటుంది. వేలమంది, లక్షలమంది భావుకులు తమ గుండె లను పిండి యుగయుగాలుగా నింపిన అమృత భాండం పేరు కళ. దానికి విలువను మీరు భూలోకాన్నంతా ఇచ్చి కూడా లెక్కగట్టలేరు. అటువంటిది మీ చేతిలో పడింది. కాని దాన్ని మీరు ఏం చేశారు? వీధిపాలు చేయదలచారు."

"రోహిణీ!" ఆవేశపడుతున్నాడు మధుమూర్తి.

"మధుబాబూ! మీరిక వెళ్ళి రండి."

# 11

మధుమూర్తితో పరిచయం లేని వాళ్ళు పోల్చుకోవాలే తప్ప, పాత పరిచయం గల వ్యక్తులకు పూర్తిగా కొత్త మనిషిగా కన్పడ్డాడు. వెనుకటి మధుమూర్తి వేరు, ఈ నాటి మనిషి వేరు. పూలూ, తీగలూ చూచి పరవశించి నిమిషానికో సారి భావ ప్రపంచంలో మూర్ఛనలు

పలికే ఉద్విగ్న కళాకారుడు ఆ మధుమూర్తికీ, జీవితాన్ని అడుగడుగూ అనుక్షణమూ ఏచి, తూచి నడిచే ఈ మాధవుడికీ ఎంత తేడా!

జామతోట అమ్మేశాడు. వచ్చిన డబ్బును బ్యాంకులో వేసి చెల్లెలి పెండ్లికి ఏర్పాట్లు చేశాడు. పూర్వమయితే ఆ తోట పోతూ వుంటే తన శరీరంలో నుండి కొంత భాగం విడివడి పోయినట్లు బాధ పడేవాడు. ఇప్పుడా బాధలు లేవు, ఆ అనుభూతులూ లేవు.

సమాజపు సున్నపు గానుగలోపడి నలిగిపోయిన కళాకారుడు తాను. లోకంలో రూపాయలూ, అణాలూ, పైసలకూ గల విలువను అర్థం చేసుకున్నాడు. జగత్తు కళాత్మకమైన విలువలపై కాక కాసుపై నడుస్తున్నదన్న నగ్న సత్యం ప్రత్యక్షానుభవం ద్వారా అర్థమైంది.

శ్యామల వివాహం ఆర్భాటం లేకుండా జరిపించాడు. ఆహూతులలో బోరుపాలెం ప్రముఖులు మినహాయించి, మిగిలిన వారంతా వచ్చారు. రోహిణి కూడా వచ్చింది.

హడావుడిలో తానూ, రోహిణీ అసలు పరస్పరం సంభాషించే అవకాశమే దొరకలేదు.

నిజంగా ఇద్దరూ కాసేపు కూర్చొని మాట్లాడాలని మాత్రం అనుకుంటున్నారా? ఏమో! ఎవరు చెప్పగలరు?

రోహిణి కూడా ముహూర్తం కాగానే వెళ్ళిపోయింది.

శ్యామలను చూచి మహాలక్ష్మమ్మ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నది. ఆర్భాటం లేకుండా జరుగుతున్న కల్యాణమనా? ఆయన ఇక్కడి నుండి కాక అక్కడి నుండి చూస్తున్నాడనా? లేక అవి ఆనంద భాష్పాలా? ఏమో!

శ్యామల వివాహం కాగానే భర్త వద్దకు వెళ్ళిపోయింది. ఇల్లంతా బావురుమన్నట్లు తోచింది తల్లీ కొడుకులకు.

ఇప్పటివరకూ వంట నుండి దూరంగా వున్న మహాలక్ష్మమ్మ నెత్తిన వంట బాధ్యత పడింది. ఇక ఆమె ఆరోగ్యం! ఒక కష్టం తీరితే మరొక కష్టం-మరొక సమస్య. కాని గత్యంతరమేమిటి?

ఇలా వుండగా మధుకి హైదరాబాదు నుండి ఒక జాబు వచ్చింది- రవీంద్రభారతిలో జరిగే ఒక ఉత్సవంలో తమ గేయాలు

విన్పించవలసిందిగానూ, రానూ పోనూ ఫస్టు క్లాసు చార్జీలు ఇచ్చి శాలువతో మాత్రం సన్మానించగలమనీనూ.

ముందు ఆశ్చర్యపడ్డాడు. తర్వాత ఆలోచించాడు- ఎలా తెలిసింది తన పేరు వీళ్ళకు?

ఆ తర్వాత నిశ్చయానికి వచ్చాడు-ఇది రోహిణి ప్రోత్సాహం వల్ల జరిగిన పని అయి వుంటుందని. వెళ్ళాలా-వద్దా? ఎందుకు వెళ్ళ కూడదు?

వెళ్ళడానికి నిశ్చయించి తన ఆమోదాన్ని తెలియ జేశాడు లేఖ రూపంలో వాళ్ళకు.

రోహిణితో ఈ విషయం చెప్పాలా? ఎందుకు చెప్పాలి?

ఆమె దృష్టిలో....తనలో సంయమనం వచ్చాక చెప్పవచ్చు, కనబడవచ్చు ననుకున్నాడు.

గుంటూరు నుండి డీలక్సులో హైరాబాదుకు టిక్కెట్టు రిజర్వు చేసుకున్నాడు. రాత్రి 8 గంటల ప్రాంతాన వెళ్ళి ఎక్కాడు. విజయ వాడనుండి రైల్లో వెళ్ళవచ్చుకాని, ఆ భూలోక నరకాన్ని కోరి కోరి ఎవడు డబ్బిచ్చి కొనుక్కుంటాడు? చిత్రగుప్తుడు పాపులకు శిక్ష వ్రాయదలిస్తే, నవ భారతంలో ఓ రోజు రైలు ప్రయాణం వ్రాస్తే చాలుననే జనాభిప్రాయం మధుకి నచ్చింది.

తాను కూర్చునే సీటులో అప్పటికే ఎవరో స్త్రీ కూర్చొని వుంది. అసౌకర్యంగా బాధపడి మధు కండక్టర్‌కు చెప్పాడు. అతడు హిందీలో జవాబిచ్చాడు- "ఈ విషయంలో నేను అసహాయుణ్ణి- మీరు అక్కడే కూర్చోక తప్పదు" అని.

బస్సులో చాలా జంటలు ప్రయాణం చేస్తున్నాయి.

కాని అన్నీ అనురాగం వదలలేని అపురూపమైన జంటలే. ఆ అనురాగం ఇంట్లోనే కాదు- వీధిలో, బస్సులో కూడా. సౌజన్యం దృష్ట్యా ఏ మగవాడైనా స్త్రీకి తన సీటును తన భార్య పక్కన ఇచ్చి తాను ఇవతల సర్దుకోవచ్చు. కాని ఒక్కరాత్రి విరహం-అబ్బో! ఎవడి తరం?

భావపరంపరను ఆపి మధు ఆమె సరసన మాట్లాడకుండా కూర్చున్నాడు.

...గమిస్తున్న సమాజం! స్త్రీలు పురుషులతో సమానంగా నట్టువృద్ధి చెందుతున్న కాలం! సీట్ల కేటాయింపులో ఇంకా చాద స్తమూ వెనుకబడిన తనమూ ఏ మూఢుడు ఆలోచిస్తాడు-తాను తప్ప!

పక్క సీట్లో ఆమె ఆప్యాయంగా పలకరించింది.

"మధుమూర్తి. హైదరాబాదు దాకా వెళుతున్నాను. మీరు..."

"నేనక్కడే లకిడీకాపూల్‌లో ఉద్యోగం చేస్తున్నాను" అంటూ తన గూర్చి కొన్ని వివరాలు చెప్పింది.

ఆమె పేరు మాధురీ రొనాల్డ్-ఫిలిప్స్ రొనాల్డ్ భార్య. విద్యా రంగంలో పని చేస్తున్నది. డ్యూటీ మీద గుంటూరు వచ్చింది.

మధుమూర్తితాను వెళుతున్న పనిని ఆమె కోరికపై చెప్పాడు.

"అవునవును. జీరాలోని కల్చరల్ సంఘంవారు మొన్న ఆహ్వానం ఇచ్చి వెళ్ళారు. ఇదే ఫంక్షనన్నమాట!"

"కావచ్చండీ!"

"మీకు హిందీ బాగా వచ్చా?" మాధురి ప్రశ్నించింది.

"లేదు."

"వస్తే బాగుంటుంది-హైదరాబాదులో.మన వైపైతే ఇంగ్లీషు వాలు."

బస్సు బయలుదేరింది.

మాధురి మధు కన్నా వయస్సులో పెద్దది. అంతే కాదు-ఆమె కళ్ళు చాలా లోతైన ఆలోచనలతో నిండి వున్నాయి. మనిషిని చూడ గానే చాలా వివేకం కలదీ, చాకచక్యం కలదీ అని గ్రహించవచ్చు.

మధు కునికిపాట్లు పడాలనుకున్నాడు.

మాధురి తన కుటుంబం నుండి విశ్వ కుటుంబం వరకూ అన్ని సమస్యలూ మాట్లాడింది. కొంత సేపయినాక ఆమె నవ్వుతూ అన్నది-

"మీకు నిద్ర వస్తున్నట్లున్నది?"

"అవును. మీరేమిటి అలాగే హుషారుగా కూర్చున్నారు?"

"నాకు నిద్ర- రాత్రి అలవాటు లేదు."

'చచ్చాం పొ'మ్మనుకున్నాడు మధు. ఇదేమి నిశాచర ప్రవృత్తి?

"ఎందువల్ల?" అనుకోకుండానే ఈ ప్రశ్న అడిగాడు. తర్వాత

అనవసరమైన చొరవ తీసుకున్నానేమోనని అనుకున్నాడు. తర్వాత ఆమె చెప్పిన విషయాలు అతనిలో అమితమైన ఆశ్చర్యాన్ని కలిగించాయి.

"మా తమ్ముని వల్ల-అతడు రాత్రిళ్ళు నిద్రపోడు."

"ఊఁ." ఆసక్తిగా విన్నాడు- "అతని పేరు?"

"చంచల రాజు- ఇరవై ఒకటవ శతాబ్దపు నెమలి."

"ఏమిటి మీరు చెపుతున్నారు?"

"మా తమ్ముడి పేరండీ!"

"నాతో పరిహాసమాడుతున్నారు."

"నిజమండీబాబూ! అదే వాడిపేరు."

"అదేంపేరు?"

"చంచలరాజ్ వాడిపేరు. ఇకపోతే ఇంగ్లీషులో ఏదో ఇరవయ్యవ శతాబ్దపు నక్కవుందిట. భారత దేశానికి నెమలి చిహ్నం కాబట్టి, తానొక శతాబ్దం ముందు పుట్టవలసిన మేధావి కాబట్టి, తన పేరు ఇరవై ఒకటవ శతాబ్దపు నెమలి అని పెట్టుకున్నాడు."

"మీరలాగే పిలుస్తారా?"

"ఎవడు పిలుస్తాడండీ అలా ఆ బాదస్తుణి మధుగారూ! అతడు పిచ్చివాడని నా అభిప్రాయం. కాని ఈ మాటను నా బంధువులూ, వాడి మిత్రులూ నమ్మడంలేదు."

"నిజమా?"

"అవును. పిచ్చి అంటే అరవడం కరవడం వంటి వేనా? అందులో డిగ్రీల తారతమ్యముంది. ఇదొక రకమైన పిచ్చి అని నా భావం. కొందరు సైకాలజిష్టులతో కన్సల్ట్ చేసినప్పుడు వారు ఇదే అభిప్రాయం వ్యక్తపరిచారు. ఏమిటో నా కర్మం!" మాధురి మోము విచారంగా మారిపోయింది.

"మధుగారూ! మీరు చెప్పండి-రేడియోపెట్టుకొని ఒంటరిగా గెంతుతుంటాడు. అందులో రన్నింగ్ కామెంటరీ వినబడితే 'హిప్-హిప్-హుర్రే' అని అరుస్తూ ఇల్లంతా గందరగోళం చేస్తాడు. ఆకాశాన మబ్బుకనబడేసరికి 'అయ్యో! ఔట్‌డోర్ షూటింగులన్నీ నాశనమైపోయాయి' అని అక్షరాలా ఏడుస్తాడు, తానే ప్రొడ్యూసరై

మధ్య మధ్య 'అయ్యో గుర్రాలు-గుర్రాలు-వానకు అన్యాయమై పోతాయి' అంటుంటాడు."

మధు నవ్వి, "ఇవన్నీ పిచ్చి లక్షణాలు కావండీ! వయస్సు ప్రవేశించే ప్రతి యువకుడూ ఈ కాలంలో ఇలాగే హుషారుగా వుంటాడు."

"అదే మధుగారూ! మీరలా పొరపడ్డారు అందరి లాగే. సరే! మరికొన్ని సంఘటనయి చెపుతాను వినండి- వాడు తన గది గుమ్మంమీద 'చిన్-టిన్-టిన్' అని వ్రాశాడు. 'ఇదేమిరా?' అంటే ఆ గది రహస్య పరిశోధనా గారమట! అందులో ఎక్స్‌ప్లోజివ్స్ ఉన్నాయట."

"నిజంగానా?"

"వాడి మొఖం! వినండి కొంచెం-అది పెద్ద అంతర్జాతీయ రహస్య సంస్థకు కార్యాలయమట! అందులో వైర్‌లెస్‌లతో పనిచేసి అంతర్‌రాష్ట్రీయ దొంగల గుంపును పట్టేస్తారట! దీనికేమంటారు?"

"బహుశా డిటెక్టివ్ నవలలు చదివివుంటాడు."

"అంతేకాదు-డిటెక్టివ్ సినిమాలు కూడాచూచాడు తెగ.ఇంగ్లీషు సినిమాలే ముఖ్యంగా చూస్తాడు. అందులో అంతర్జాతీయ దొంగల ముఠాల కథలూ, అన్నింటినీ జయించే డెత్-ప్రూఫ్ హీరోలు ఉంటారు చూడండి-వాళ్ళను అనుకరిస్తున్నాడు."

"ఇది పిచ్చికాదు-కేవలం సరదా."

"అర్ధరాత్రి పన్నెండు గంటలకు భూతద్దం తీసుకొని గది గోడలన్నీ పరీక్షించడం మాటేమిటి? వాకిట్లోకి వచ్చిన ప్రతి బిచ్చ గాడి మీసమూ-గడ్డమూపట్టిలాగి 'ఎలిబీ' దొరికిందని అరవడమో?"

మధు నవ్వాడు.

"మధుగారూ! ఇంకా భయంకరమైన విషయాలున్నాయి. ఇవేవీకూడా పిచ్చికాదనే నా మిత్రుల అభిప్రాయం కాని, నాకుమాత్రం బాగా తెలుసు-అతనికి మతి చలించింది. వాడు నిజంగా చంచలరాజ్ అయినాడు." మాధురికళ్ళు నిజంగానే ఆర్ద్రమైనాయి.

"మీ వారు ఈ విషయంలో ఏమన్నారు?"

విజయ

"వారు అలహాబాద్‌లో వుంటారు" అని ఆయన పనిచేసే పత్రికపేరు చెప్పింది.

"వారితో ఒకటి రెండుసార్లు సంప్రదించాను. వారు నవ్వి ఊరుకున్నారే కాని, దాన్ని సీరియస్‌గా తీసుకోలేదు. ఏం చేస్తాను? ఇది నా మిస్-ఫార్చ్యూన్!" కళ్ళు అద్దుకుంది.

దానితో మధు ఇక మాట్లాడలేదు.

"హైదరాబాదులో మీ ఇంటికి తప్పక వస్తానండీ!" అయాచితంగానే అన్నాడు.

"అదే నేనూ అందామనుకుంటున్నాను. నాకూ కవిత్వమంటే చాలా ఇష్టం. ఒక పూట నా మిత్రులను పిలిపించి చిన్న సింపోజియం అరేంజ్ చేస్తాను- అందు మీరు ప్రధాన పాత్రవహిద్దురు."

"అలాగే."

బస్సు చీకటిని చీల్చుకుంటూ ముందుకు వెళ్ళి పోతున్నది. ఒక్క డ్రైవర్ తప్ప అంతా నిద్రలో మునిగారు.

తెల్లవారే సరికి హైదరాబాదు డిపో వచ్చింది. మాధురి తన విజిటింగ్ కార్డ్ ఒకటి మధుకి ఇచ్చింది.

టాక్సీలో ఆహూతులు మధును రిసీవ్ చేసుకునేందుకు డిపోకు వచ్చారు. మధువారికి నమస్కరించి తన చిన్నబాగ్‌తో దిగి కారులో కూర్చున్నాడు. కారు బషీర్‌బాగ్‌లో ఒకచోట విశ్రాంతి గృహం వద్ద ఆగింది.

మదుకి వసతులన్నీ చూపించి, వారు తమ కార్యక్రమానికై వెళ్ళిపోయారు.

అప్పటికే ప్రక్క గదిలో ఒక సంగీత బృందం దిగి వుంది. వారు తమ వాద్యాలను టింగ్-టింగ్‌మనిపిస్తున్నారు. అయితే మధు బాగా అలసిపోయివున్నాడు. ఎవరితోనూ చర్చలు పెట్టుకోలేదు. టిఫెన్ తీసుకొని పూర్తిగా విశ్రాంతి తీసుకున్నాడు. ఆ పడుకోవడం మధ్యాహ్నం ఒంటిగంటకు లేచాడు. భోంచేసి తిరిగి పడుకున్నాడు.

గాఢనిద్రపట్టలేదు కాని, మత్తుగా పడుకున్నాడు. కళ్ళ ఎదుట రోహిణి నర్తిస్తున్న దృశ్యం.

కృష్ణా నది రోహిణిగా మారింది. ప్రకృతి మొత్తం ఆమెకు

అలంకారాలు. జంత్రసంగీతాలు! భూమ్యాకాశాలు ఏకమైనాయి. ర
జగత్తు లాస్యమాడుతున్నది.

మధు మత్తు వదిలింది. లేచి కూర్చున్నాడు. రోహిణిలేదు కాని,
మిగిలినదంతా నిజమే!

పక్క గదిలో నుండి గంధర్వగానాలూ, వాద్య సంగీతాలూ
వస్తున్నాయి. ఇదన్నమాట తన మధురోహకు అంకురార్పణ.

దీనితో మానవుడు ఎంత క్షుద్రుడో-ఎంతటి మహాత్ముడో
కూడా అర్థమైంది.

ఈ అనంత సృష్టిలోని ఒక అత్యల్ప ప్రాణి మానవుడు-
దేవుణ్ణికూడా పరవశం చేయగల నాద బ్రహ్మాన్ని సృజించగలడు.
శబ్దబ్రహ్మాన్ని పలికించ గలడు.

వెళ్ళి వాళ్ళ గదిలో కూర్చున్నాడు. భావతన్మయత్వంలో
మునిగిపోయాడు.

తిరిగి-ఇన్నాళ్ళకు-ఇన్నాళ్ళకు-ఈ భావవీణ మ్రోగింది. ఇన్నా
ళ్ళకు తిరిగి ఈనాడు- ఈపూట- వాస్తవ జగత్తును మరచిపోయాడు
మధు.

ఆ ఆవేశంతోనే రవీంద్రభారతిలోని ఉత్సవంలో కవిత్వం
చదివాడు. స్థానికులైన కవులు కూడా ఓ ముగ్గురు పాల్గొన్నారు కాని,
మధు అందరినీ మించాడు. ప్రతిపంక్తికీ కరతాళధ్వనులు! ప్రతి అక్ష
రానికీ ఆనందస్రవంతులు.... అమృతవాహినులు!

(మిగతా కథ 'అమృతవాహిని' రెండవ భాగంలో చదవండి.)

---

# విజయ

జనవరి నెల నవలానుబంధం

# అమృతవాహిని

—డా॥ ముదిగొండ శివప్రసాద్

(రెండవ భాగం)



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M137 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 97 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | ch. Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |